
June 2012 ₹20/-
*Founded by B. Nagi Reddi and Chakrapani*

**Editor & Publisher :**
Prashant Sharad Mulekar

**Associate Editors :**
R. Vaasugi, K. Raja Sekhara Raju

**Sub Editor :**
Patricia Pandian

**General Manager :**
Sowmya Bharadwaj

**Senior Artists:**
K.C. Sivasankaran (Sankar), Gandhi Ayya, P. Mahesh, Sandeep Solkar

**Artist :**
Venki

**Layout Designers :**
B. Thirumal, K. Narendra, N. Sivakumar

**Production In-charge :**
Prashant Pawar

**Circulation:**
circulation@chandamama.com

**Asst. Manager - Sales & Circulation:**
Sobhankar Rej

**Sales Officer - Circulation :**
K. Ravishankar

**Advertisement :**
sales@chandamama.com

**Subscription :**
Subscription@chandamama.com
Ramya K (Chennai)
Ph: +91 44 4399 2828

**Head Office :**
**CHANDAMAMA INDIA LTD.,**
P.O.Box No:19407, Mumbai-400093
Phone +91 22 28312872 / 28311849
Email:chandamama@chandamama.com
Website : www.chandamama.com

Published, Printed and Owned by CHANDAMAMA INDIA LTD.,
Published and Printed on their behalf by Prashant Sharad Mulekar
Published at B-3, Cross Road 'B', MIDC, Andheri (East) Mumbai - 400093.
Printed At :- Kala Jyothi Process Pvt. Ltd, S.No.185, Kondapur, R.R.District-500133, Andhra Pradesh.
Editor :- Prashant Sharad Mulekar



# ఈ సంచికలో...

## చందమామ

Volume-3 June 2012 Issue-06





## ద్రవ్యోల్బణం, వర్షాలూ....

ప్రపంచం తీవ్రమైన మాంద్యం గుండా వెళుతోంది. నేతలు తీవ్రంగా ప్రయత్నిస్తున్నప్పటికీ అంధకారంలో కాసింత వెలుగు చూడటానికి మనకు కాస్త సమయం పట్టవచ్చు. భారతదేశం కూడా ఇప్పటికే మాంద్య ప్రభావానికి గురైంది. ఇది ప్రపంచ ఆర్థిక వ్యవస్థ యొక్క అతి పెద్ద ప్రతికూలాంశాలలో ఒకటి. పైగా మనం తీవ్రమైన ద్రవ్యోల్బణాన్ని కూడా చవిచూస్తున్నాము. అన్ని రకాల ముడిసరుకుల ధరలు పెరుగుతూనే ఉన్నాయి. చందమామకు సంబంధించి మేము కూడా ఈ సమస్యను ఎదుర్కొంటున్నాము. గత రెండు సంవత్సరాలుగా ముడిసరకుల ధరలలో పెరుగుదలను మేమే భరిస్తూ వస్తూ, దీన్నుంచి బయట పడటానికి మా వంతు ప్రయత్నాలు చేస్తూ వచ్చాము. కాని మా అవకాశాలు రానురాను కుదించుకుపోయాయి. భారమైన హృదయం తోటే జూలై నెలనుంచి మా అన్ని ప్రచురణల ధరలను పెంచబోతున్నామని ప్రకటించక తప్పడం లేదు. చందమామ ఉనికిలో ఉండాలంటే ఇది మాకు తప్పనిసరిగా మారింది. అయితే జూలై నెలలో మేము అందుకున్న చందమామ చందాలు పాత ధరలతోనే కొనసాగుతాయి. చందమామ పాఠకులు అర్థం చేసుకుని సహకరించగలరని ఆశిస్తున్నాము.

ఈసారీ దేశంలో సాధారణ వర్షపాతమే ఉంటుందని వాతావరణ శాఖ అంచనా. మనకిది కాస్త ఊరటనిస్తుంది. మన ఆర్థిక వ్యవస్థ పూర్తిగా రుతువులమీదే ఆధారపడుతోంది. రుతువులతో పని లేకుండా ప్రతి ఏటా మనం నీరూ ఆహారం పొందగలిగేలా మన విధాన నిర్ణేతలు పథకాలు చేయడానికి ఇదే మంచి తరుణం.

విద్యా సంవత్సరం కూడా ప్రారంభమవుతుంది కాబట్టి రోజులో చదువు, ఆట, టీవీ చూడటం మధ్య సమతూకం ఉండేలా చూసుకోవాలి. దీంతో బడిలో మంచి ఫలితాలను సాధించడంతో పాటు పూర్తి స్థాయిలో ఆటలను ఆస్వాదించడానికి, వ్యక్తిగా బాగా ఎదగడానికి కూడా వీలుంటుంది.

జూన్ 1న అంతర్జాతీయ పిల్లల దినం. ఈ సందర్భంగా జీవితంలో అవకాశాలు, భాగ్యం లేని వారికి సహాయపడటానికి మనం ప్రయత్నించాలి. స్నేహితులకు మనం ఎలా సహకరించగలమో సలహాలు రాసి పంపవలసిందిగా మా పాఠకులను కోరుతున్నాము.

– సంపాదకులు



# పాఠకుల లేఖలు

గత 55 సంవత్సరాలుగా చందమామ పాఠకురాలిని. చందమామను చూస్తే ఎన్నో జ్ఞాపకాలు. జైలు సూపర్నెంటుగా పనిచేసిన మా వారు ఆఫీసు నుంచి వచ్చాక ఏమాత్రం తీరిక దొరికినా చందమామే చదివేవారు. మా ఏడుగురు పిల్లలకు రామాయణ, భారతాలు పరిచయం చేసిన పుణ్యం చందమామదే. ఇప్పుడు చందమామ తిరిగి పూర్వవైభవం సంపాదించింది. చాలా కథలు వేస్తున్నారు. మళ్లీ మా ఇంట్లోకి వెన్నెల వెలుగులు వస్తున్నాయి. నాకిప్పుడు 81 సంవత్సరాలు. నూరేళ్ళ వరకు చందమామ చదువుతుండాలని నా ఆశ. చందమామ ఇంటిల్లిపాదిని ఇలాగే అలరించాలని ఆశీర్వదిస్తున్నాను. – మాచిరాజు రత్నకుమారి, హైదరాబాద్

ఏప్రిల్ సంచికలో నా తొలి కథ 'అనువుగానిచోట' చూడగానే ఎంత సంతోషమేసిందో మాటల్లో చెప్పలేను. నర్సింగ్ హోమ్ నుంచి ఇంటికొచ్చి రాత్రి ఏక బిగిన చదివేశాను. నడి రాత్రిలోనూ చందమామను మునివేళ్లతో పట్టుకుని నిమురుతుంటే మా చెల్లెలు చూసి 'ఇక చాల్లేపడుకో' అంటూ మందలించింది. దీనికి కారణం ఉంది. ఇతర పిల్లల పత్రికలకు కథలు పంపే నా స్నేహితురాళ్లు 'చందమామలో నా కథ పడుతోంద'ని చెబితే అదీ చూద్దాం అంటూ గత కొంతకాలంగా గేలి చేస్తూ వచ్చారు. అందుకే చందమామలో నా తొలి కథను ఆనందంతో కాదు కసిగా చదివాను. 12 భాషల్లో చందమామను తెప్పించుకుని వాళ్లందరికీ నా కథను 12 భాషల సంచికలలో చూపించి నవ్వాలని ఉంది. చందమామలో నా తొలి కథ ప్రచురించినందుకు హృదయపూర్వక కృతజ్ఞతలు. – డాక్టర్ సిరి, మిర్యాలగూడ, నల్గొండ

ఊహ తెలిసినప్పటి నుంచి చందమామ తెలుసు. ఇప్పటికీ చందమామ చేతికొచ్చిందంటే చాలు పుస్తకం మొత్తం చదవందే వదలను. అయితే నేను చదివే విధానం గమ్మత్తుగా ఉంటుంది. వెనకపేజీ నుంచి మొదలు పెట్టి ముఖచిత్రంతో ముగిస్తాను. నాకు పది సంవత్సరాల వయసు మనవడున్నాడు. కథ చెబితే గాని నిద్రపోడు. రోజుకో కొత్త కథ చెప్పాలి. అలాంటప్పుడు అనిపిస్తుంటుంది. 'చందమామ నెలకొక్కటేనా' అని. – వై. సువర్ణకళ, ఉప్పల్, హైదరాబాద్

ఏప్రిల్ చందమామ చక్కటి కథలతో పున్నమి చంద్రుడిలా నిండుగా ఉంది. అయితే 'తరం-అంతరం' కథ జాబిలిలోని మచ్చలా అనిపించింది. గ్యాస్ స్టవ్‌లు, మిక్సీలు, పిజ్జాలు, బర్గర్లు, కంప్యూటర్, ఆఫీసు లాంటి పదాలు చందమామకు వద్దు. ఇలాంటి సబ్జెక్టులతో వెయ్యి కథలు రాయొచ్చు. అయితే అవి చందమామకు అందాన్నివ్వవు. అలాంటి కథలకు చాలా పత్రికలు ఉన్నాయి. ఎన్నో గొప్ప పత్రికలు సైతం కాలగర్భంలో కలిసి పోయినా, చందమామ ఇప్పటిదాకా గర్వంగా తలెత్తుకుని నిలబడిందంటే ఆ గొప్పతనం దాని మూలాల్లోనే ఉంది. దయచేసి వాటిని అలాగే కాపాడండి. చందమామకి ఆధునికత వద్దు.. వద్దు.. వద్దు...

– పి. వెంకటేశ్వరరావు, తూర్పుగోదావరి, ఏపి

గత కొద్ది నెలలుగా చందమామలో వస్తున్న కథల సంఖ్య చూసి చాలా ఆనందం కలిగింది. ఎక్కువ మంది రచయితలకు అవకాశం కల్పించడం ముదావహం. చందమామకు పూర్వవైభవం తెచ్చే ప్రయత్నంలో మీరు విజయం సాధించాలని అభిలషిస్తున్నాను.

– జి. సుబ్రహ్మణ్య గౌడ్, రాజంపేట, కడప, ఏపి

తెలుగు చందమామ అంటే మాకు చాలా ఇష్టం. ప్రతి నెలా చందమామ కోసం ఎదురుచూస్తుంటాము. ఏప్రిల్ సంచికలోని 'భూమి పుత్రుడు', 'పరీక్షలు', 'నష్టం మూడుసార్లు' కథలు ఎంతో బాగున్నాయి. మేము తెలుగు భాష నేర్చుకునేందుకు చక్కగా చందమామ ఉపయోగపడుతున్న చందమామకు మా కృతజ్ఞతలు. – టి. అనీష్ శ్రీనివాస్, భవ్యశ్రీ, గుంటూరు, ఏపి

ఏప్రిల్ నెల సంపాదకీయం గొప్ప సత్యాన్ని చెప్పింది. ఈరోజు బోధకులుగా ఉన్నవారు రేపు విద్యార్థిగా మారతారు. 'మన ఆలోచనలే మన సంపదలు' అంటూ సాయిబాబా ప్రవచించిన సూక్తి సార్వత్రిక విలువను బోధిస్తోంది. – టివిఎస్ శాస్త్రి, తెనాలి, ఏపి

నా తొమ్మిదవ ఏటనుంచి చందమామ చదవటం అలవాటు. అప్పుడు దీని ధర పావలా.. ఇప్పుడు నాకు 66 సంవత్సరాలు. నేటికీ కొని చదువుతున్నాను. – ఇందిర, హైదరాబాద్

అట్టమీద బొమ్మలో, ప్రవచించే బోధనలు పాటించాలన్న సత్యసాయి వాక్కు సత్యం. చిత్రాలలో జీవం తగ్గుతోంది. సంజీవని ఫలం చిన్న కథ, చాలా మంచి కథ. క్విజ్‌లు వాటి ఫలితాలు మరుసటి నెలలోనే వచ్చేలాగా చూడండి. – రామచంద్ర, నెల్లూరు, ఏపి

నాకు 65 సంవత్సరాలు. సంస్కృత విద్యార్థిని. సంస్కృతాన్ని అభ్యసించడానికి చందమామ చాలా ఉపయోగకారిగా ఉంటోంది. సంస్కృత ప్రచారం కోసం మీరు చేస్తున్న కృషి ప్రశంసనీయమే కాని సంస్కృత ప్రేమికుల కోసం చందమామ ధరను దయచేసి తగ్గించగలరు.

– సుబ్రహ్మణ్యం పుల్టా ఎ.డి. ఉజ్జయిని, మధ్యప్రదేశ్

నేను 75 సంవత్సరాల వయస్సులో కూడా చందమామ చదువుతున్నాను. చిత్రలేఖనంలో ఎం.ఎ చదువుతుండగా చందమామ చిత్రాలు నాకెంతగానో సహాయం చేశాయి. బొమ్మలతో కూడిన కథలు ఈనాటికీ నా జ్ఞాపకాలలో ఉండిపోయాయి. చందమామ సంపాదక బృందానికి, పాఠకులకు నా శుభాకాంక్షలు. – హుకుంచంద్ ఎస్. ఉజ్జయిని, మధ్యప్రదేశ్

నాకిప్పుడు 74 ఏళ్లు. చిన్నప్పటినుంచే నేను చందమామను చదువుతూ వచ్చాను. డబ్బు లేని కారణంగా అప్పట్లో అన్ని సంచికలూ నేను కొని చదవలేకపోయాను. చందమామలో ప్రచురించబడే అన్ని కథలూ విద్యావంతంగాను, నీతిబోధకంగాను ఉంటాయి. సూర్య చంద్రులు ఉన్నంతవరకు చందమామ కొనసాగాలని నేను దేవుడిని ప్రార్థిస్తాను. దయచేసి నేపాలీ భాషను కూడా చాటర్ బాక్స్ శీర్షికలో పొందుపర్చగలరు.

– కార్తీక్ సిహెచ్. మున్నా, పశ్చిమబెంగాల్

చంద్రుడిమీదికి చేరడానికి ముందుగా చాలా కాలం అమెరికా శాస్త్రజ్ఞులు పరిశోధించారు. కానీ భారతదేశంలో ప్రతి నెలా మా ముంగిళ్లలోకి చందమామ వస్తున్నందుకు ఎంత సంతోషిస్తుంటామో మాటల్లో చెప్పలేము. సంవత్సరాలుగా మీరు చేస్తున్న కృషికి మా హృదయపూర్వక అభినందనలు. చందమామ మరింత ఎత్తుకు ఎదగాలని మనసారా కోరుకుంటూ...

– ప్రొఫెసర్ సందీప్ కుమార్, పంజాబ్





## చందమామతో నా జ్ఞాపకాలు – తెలుగు

మామగారికన్నా చందమామే నాకు దగ్గరి బంధువు.

చిన్నప్పుడు ప్రతి నెలా మూడవ తారీకు వచ్చిందంటే చాలు. నాన్న ఎంత ఆలస్యంగా ఇంటికి చేరినా సరే, మేము మెలకువగా ఉండాల్సిందే. ఎందుకంటే ఆ రోజు ఆకాశంలో చందమామ రానీ రాకపోనీ, ఇంట్లోకి మాత్రం చందమామ పత్రిక తప్పనిసరిగా వస్తుంది.

అందరూ అక్షరాలు, గుణింతం బడిలో నేర్చుకుంటారు. నాకు మాత్రం మొదటి బడి చందమామే. బడిలో చేరక ముందే నాకు అక్షరాలు వచ్చు. రెండవ తరగతిలో ఉండగానే అక్షరాలు ఒకటొకటిగా కూడబలుక్కుని చందమామను చదివాను. నేను చదివిన పద్ధతి ఇదేమరి. చదవడాన్ని అభ్యసించడంలో చందమామే నాకు ప్రేరణ.

...తబలకడం ద్వారానే చందమామను ...ు. ఆ విధంగానే వేగంగా చదవడం కూడా ...

Name: ...
Occup...
Hyder...



...రు. చుట్టు ఫక్కల కొన్ని పల్లెలకు మా ... ఊర్లో అన్ని బడులకూ కలిపి ఆటల ...పేవారు. నావంటి బద్ధకపు పిల్లల కొరకేమో ...ి. కథలు చెప్పడంలో ఎప్పుడూ మొదటి ...ఇంకెవరికీ చందమామ చదవడం రాదు మరి. అది నా విజయ రహస్యం.

'ముగ్గురు మాంత్రికులు,' 'సింద్‌బాద్ యాత్రలు' సీరియల్స్ కూడా నాకు గుర్తున్నాయి. అంతకు ముందువి ఏముండేవబ్బా!

గుండు భీమన్న కథలూ గుర్తున్నాయి. ఫోటో వ్యాఖ్యల పోటీకి ఎంట్రీలు పంపాలని ప్రతి నెలా కలలు కనడమే. పంపింది మాత్రం లేదు.

చందమామలో దీపావళి ప్రత్యేక సంచిక కొత్తపేజీలలోంచి కమ్మగా వచ్చే కునేగా సెంట్ వాసన కలకాలం గుర్తుండిపోయేది. అప్పట్లో చందమామలో వచ్చే ప్రకటనలు బహు ఆసక్తికరంగా ఉండేవి.

మా ఇంట్లో చెక్క పెట్టె నిండా సంవత్సరాల వారీగా చందమామలు సర్ది ఉండేవి. కారణాలు చెప్పలేను కానీ, అవన్నీ ఇప్పుడు నావద్ద లేవు. ఆ సంగతి తెలిసిన నాడు నేను అన్నం తినలేదు.

ఇప్పుడు నేనూ ఒక రచయితనూ, పేరున్న మనిషిని అయినానంటే, నాన్న ఎంత కారణమో చందమామ కూడా అంత కారణమని నాకనిపిస్తుంది.

## చందమామతో నా జ్ఞాపకాలు - కన్నడ

'చందమామతో నా జ్ఞాపకాలు' కథనాలను చదివినప్పుడు నిజంగా నేను యాభై ఏళ్లవెనక్కి వెళ్లి చూసుకున్నాను. నిజం చెప్పాలంటే నాలో పుస్తకాలు చదివే అలవాటు పెరగడానికి చందమామే కారణం. మా పెద్దన్న క్రమం తప్పకుండా చందమామను ఇంటికి తీసుకుని వచ్చేవాడు. చందమామను ముందుగా ఎవరు చదవాలి అనే విషయంపై నాకూ, మా పెద్ద అక్కగార్లకు మధ్య పెద్ద యుద్ధమే జరిగేది. కథలన్నీ చదివితే గాని నేను చందమామను కింద పెట్టేవాణ్ణి కాదు. చందమామ కథలు ఎంతో ఆసక్తిగాను, ఆశ్చర్యభరితంగాను ఉండేవి. ఒక నెల పత్రికను చదివిన తర్వాత మేం మరుసటి నెల సంచిక కోసం ఎదురు చూసేవాళ్లం.



Name: Jeddu Sadashiva Bhatt, Bangalore.

ప్రారంభంలో 'బాలనాగమ్మ,' 'గుణసుందరి' ధారావాహికలు చాలా ఆసక్తికరంగా ఉండేవి. తర్వాత విచిత్ర కవలలు, ధూమకేతు, మకర దేవత. ముగ్గురు మాంత్రికులు వంటి సీరియల్స్ పాఠకులను మునివేళ్లపై నిలిపి చదివించేవి. ఈ విధంగా నేను చందమామతోటే పెరుగుతూ వచ్చాను. ఒక్క నెల కూడా చందమామను చదవకుండా పోయింది లేదు. ఏ కారణంవల్లనైనా ఒక నెల చందమామ అందకపోతే చాలా బాధ కలిగేది.రాబోయే తరాల కోసమని నేను చాలా సీరియల్స్‌ను బౌండ్ చేసి భద్రపర్చాను. దురదృష్టవశాత్తూ వాటిని ఇతరులకు ఇచ్చాను. తర్వాత అవి తిరిగి రాలేదు.

## చందమామతో నా జ్ఞాపకాలు - ఒడియా

జాహ్నమాము(చందమామ)తో నా సంబంధం తల్లిపిల్లల సంబంధంలాంటిది. నా చిన్నప్పుడు అంటే అయిదేళ్ల వయసులో నేను మా పిన్ని వాళ్ల ఇంట్లో ఉండేదాన్ని. అమ్మకు దూరంగా ఉండటం అనే బాధను, చింతను అధిగమించడంలో జాహ్నమాము నాకు ఎంతగానో సహాయ పడింది. చందమామను అందిన ప్రతిసారీ చదవడం పూర్తికాకూడదని అనుకుంటాను. కాని అది సాధ్యమయ్యేది కాదు. పత్రిక చదివిన వెంటనే వచ్చే నెల చందమామ కోసం ఎదురుచూసేదాన్ని. చిన్నప్పటినుంచి ఈ రోజువరకు చందమామను చదువుతూనే ఉన్నాను. నాకిప్పుడు 37 సంవత్సరాలు. ఉపాధ్యాయురాలిని. జాహ్నమామును ప్రతి నెలా చదవండని మా అబ్బాయికి, విద్యార్థులకు కూడా చెబుతుంటాను. రేపటి తరాల పిల్లలు కూడా జాహ్నమాము కోసం ఇలాగే ఎదురుచూస్తుంటారని, చూడాలని కోరుకుంటున్నాను.



Name: Laxmipriya Das Sudarshan nagar, Puri, Odisha.



## బేతాళ కథలు

# నిజమైన వేటగాడు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు 'రాజా, నువు ఈ అర్ధరాత్రివేళ ఏ ప్రయోజనం ఆశించి ఇలా సంచరిస్తున్నావో నాకు బోధపడడం లేదు. బహుశా ఎవరికయినా న్యాయం చేయడానికో లేక ఎవరి ప్రాపకం సంపాదించడానికో ఈ పనికి పూనుకున్నావేమో! ఎవరి ప్రాపకం కోసం ఈ పని చేస్తున్నావో కానీ, ఆ కార్యం నీవు కష్టపడి నెరవేర్చినా, వాళ్ళు నీ నిజాయితీని నమ్మక పోవచ్చు. పూర్వం తను దొంగ కాకున్నా వట్టి పుణ్యానికి అనుమానించబడ్డ ఒక వేటగాడి కథ చెబుతాను. శ్రమ తెలియకుండా విను,' అని కథ చెప్పసాగాడు.

పూర్వం బసవయ్య అనే వేటగాడు



అడవి పక్కన ఉన్న కొమ్ముగూడెంలో నివసిస్తూండేవాడు. గూడెంపక్కనున్న అడవిలోని జంతువులు, పక్షులే అతనికి జీవనాధారం. వాటిని పట్టిసమీప గ్రామాల్లో అమ్ముకుని జీవిస్తూండేవాడు. ఒకనాడు ఎప్పటిలాగే అడవిలోకి వెళ్ళేసరికి బాట పక్కన సగం తినేసిన మనిషి శవం కనబడ్డది. దానికి కాస్త దూరంలోనేలమీదమెరుస్తూ బంగారు గొలుసు కనబడేసరికి దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. సంతోషంగా మెడలో వేసుకున్నాడు. తర్వాత ఓ కుందేలును వేటాడి ఇంటికి తీసుకుని పోయాడు.

ఓ నెల తర్వాత 'దసరా పండుగ వస్తోంది. ఇంట్లోకి సరుకులు, పిల్లలకు మనకు బట్టలు తీసుకురండి,' అంది భార్య. 'మనవద్ద దాచిపెట్టిన డబ్బులేం లేవు. ఈ గొలుసు అమ్మి తెస్తాను,' అని చెప్పి పట్నానికి బయలుదేరాడు. నేరుగా కంసాలి కనకయ్య దుకాణానికి వెళ్ళి, గొలుసు చూపించి 'దీన్ని తీసుకుని వచ్చినంత డబ్బివ్వండి,' అనడిగాడు.

కంసాలి కనకయ్య ఆ గొలుసును చూసి ఆశ్చర్యపోయాడు. ఇది తను చేసిందే. ఏడాది క్రితం దాన్ని మురారికి ఇచ్చాను. నెల నుంచి అతడు కనిపించడం లేదు.

ఇతనే గొలుసు కోసం మురారిని చంపి ఉంటాడు అనుకుని వెంటనే భటులకు సైగ చేశాడు. రాజభటులు నగతో సహా బసవయ్యను లాక్కుని వెళ్ళి, న్యాయాధికారి ముందు నిలబెట్టారు. ఇంతలో మురారి భార్య కూడా ఏడుస్తూ న్యాయాధికారికి మొర పెట్టుకుంది.

అయ్యా, 'నా భర్తను ఇతడే చంపేసి ఉంటాడు. ఇంత ఘాతుకానికి పాల్పడిన ఇతగాడికి మరణదండన విధించి నా గొలుసు నాకిప్పించండి. నా భర్త జ్ఞాపకార్థం దానిని అట్టిపెట్టుకుంటాను' అని ఆమె కన్నీళ్ళు పెట్టుకొని న్యాయాధికారిని వేడుకొంది.

న్యాయాధికారి పేరు ధర్మరాజు. సమయస్ఫూర్తితో వ్యవహరిస్తాడని, న్యాయబద్ధంగా తీర్పు చెబుతాడని తనకు చాలా పేరుంది.



తన ఎదుట నిర్భయంగా నిలబడ్డ బసవయ్యతో, 'ఈ నగ నీకు ఎక్కడిది? నిజం చెప్పు!' అని అడిగాడు న్యాయాధికారి.

'అయ్యా! ఉదయమే నేను వేటకు వెళుతుంటే, జంతువులు తినేసిన సగం మనిషి శవం దారి పక్కన కనబడింది. ఆ పక్కనే ఈ గొలుసు పడి ఉంటే తీసుకున్నాను. సొంతదారుకు ఇద్దామన్నా అక్కడ ఎవరూ లేరు. ఇప్పుడు కుటుంబ అవసరాలకోసం అమ్ముదామని వస్తే, భటులు నన్ను పట్టుకుని, దొంగ అని మీఎదుట నిలబెట్టారు,' అన్నాడు బసవయ్య నదురు బెదురు లేకుండా.

'నువ్వు అబద్ధం చెబుతున్నావని మురారి భార్య అంటోంది. నువ్వే నగకోసం మురారిని చంపలేదని నమ్మకమేమిటి?' అనడిగాడు ధర్మరాజు.

'అయ్యా! నేను వేటగాడినే కానీ, దొంగను కాను. నన్ను నమ్మండి, కావాలంటే మీరు పరీక్షించుకోవచ్చు,' అన్నాడు బసవయ్య.

'ఏం పరీక్ష చేయమంటావు? నీ విలువిద్యా ప్రావీణ్యం ఏపాటిదో చూపిస్తావా?' అనడిగాడు ధర్మరాజు.

'నా వెంట అడవికి రండి. జంతువుల్ని, నాకు నగ దొరికిన స్థలాన్ని కూడా చూపిస్తాను,' అన్నాడు బసవయ్య ధీమాగా.

సరేనని, న్యాయాధికారి, మురారి తమ్ముడిని వెంటబెట్టుకుని వేటగాడితో అడవిలోకి వెళ్ళాడు. బసవయ్యను చూసిన





కాకులు కావ్.. కావ్.. మంటూ గోలగోలగా అరవసాగాయి. జింకలు, నక్కలు భయంతో అడవిలో పరుగులు పెట్టసాగాయి.

'నిజమే, నువ్వు వేటగాడివే అని నమ్ము తున్నాను. స్థలం చూపించు,' అన్నాడు న్యాయాధికారి.

బసవయ్య న్యాయాధికారిని వెంట బెట్టుకుని ఆ స్థలం వద్దకు వెళ్ళి, చూపించ సాగాడు. ఇంతలో హఠాత్తుగా గాండ్రు... గాండ్రు మంటూ పెద్ద పులి అరుపు విని పించింది.

'అదుగో, మనిషిని చంపిన పులి వస్తోంది. కనుకే మాటు వేసి కూర్చుంది మరో మనిషి కోసం. మీరు చెట్టెక్కండి,' అని బసవయ్య గబగబా వాళ్లను చెట్టెక్కించాడు. తర్వాత అతడు కూడా ఆ చెట్టు ఎక్కి బాణం సిద్ధంగా పట్టుకుని కూర్చున్నాడు.

కాస్సేపటికి పులి వాళ్ళుకూర్చున్న చెట్టు కిందికి వచ్చి, మనుషుల్ని అందుకోవడం కోసం, చెట్టుపైకి ఎక్కడానికి ప్రయత్నించ సాగింది.

బసవయ్య బాణం సంధించి, పులి మీదికి సూటిగా వదిలాడు. డొక్కలో దిగిన బాణంతో, పులి పెద్దగా అరుస్తూ కొద్ది దూరం వెళ్లి నేలమీద పడి చనిపోయింది. అందరూ చెట్టుమీదనుంచి దిగారు.

అప్పుడు న్యాయాధికారి బసవయ్యను మెచ్చుకోలుగా చూస్తూ, 'నువ్వు దొంగవై ఉంటే మమ్మల్ని చంపేసి, మా మెళ్లో ఉన్న ఈ బంగారాన్ని కూడా తీసుకునేవాడివే. కాని నువ్వు నిజమైన వేటగాడివి. నిన్ను అనవసరంగా అనుమానించినందుకు బాధపడుతున్నాను. మా ప్రాణాల్ని కూడ రక్షించినందుకు, నీకు బహుమతిగా ఈ హారం ఇస్తున్నాను తీసుకో,' అని తన మెళ్లో ఉన్న బంగారు గొలుసును వేటగాడి మెడలో వేశాడు.

'అయ్యా! మీరు నన్ను వేటగాడని నమ్మి నందుకు సంతోషం. కానీ ఈ మాటలు ఇక్కడ కాదు. మీ న్యాయస్థానంలో, పది మంది ముందు చెప్పండి,' అని గొలుసు తిరిగి ఇచ్చివేశాడు బసవయ్య. న్యాయాధి కారి అతని తెలివి తేటలకు ఆశ్చర్యపో





డ్డాడు. ఆ విధంగానే తనతో పాటు అతడిని తీసుకువెళ్లి, సభ ఏర్పాటు చేశాడు.

'సభికులారా! మీతోపాటు నేనూ అనవ సరంగా ఇతడిని అనుమానించాను. ఇతని సాహసం వల్లనే నేను తిరిగి మీముందు మాటాడగలుగుతున్నాను. బసవయ్య నిజమైన వేటగాడు. కాకుంటే మేము ఈ పాటికి పులికి ఆహారమైపోతుండేవాళ్ళమే. బసవయ్యకు మురారి గొలుసు దొరికిందే కాని, మురారిని హత్య చేసి ఆ గొలుసును దొంగిలించలేదు,' అని న్యాయాధికారి ధర్మరాజు జరిగిన సంఘటనంతా వివరిం చాడు. ప్రజలు అభినందన పూర్వకంగా చప్పట్లు చరిచారు. తరవాత ధర్మరాజు, రాజభటులు తెచ్చిన గొలుసును మురారి భార్య మణెమ్మకు ఇచ్చివేశాడు.

అనంతరం న్యాయాధికారి తన మెడలో గొలుసును తీసి, 'మా ప్రాణాలను రక్షించి నందుకు బసవయ్యకు ఈ చిన్ని బహుమ తిని ఇస్తున్నాను,' అని ప్రకటించి తన మెడలోని హారం తీసి, బసవయ్య మెడలో వేయబోయాడు.

'అయ్యా! మన్నించండి. మీ కానుకను తీసుకోలేను. మాకు పండుగ సరుకులు, బట్టలు ఇప్పించండి చాలు. గొలుసు మాత్రం వద్దు,' అని వేడుకున్నాడు.

బసవయ్య మాటలు విని ఏదో అర్థమ యినట్లుగా నవ్వి, ఏడాదికి సరిపడా సరు కులు, అతని కుటుంబానికి సరిపోను బట్టలు పెట్టి, గౌరవంగా వీడ్కోలు పలి కాడు న్యాయాధికారి.

బేతాళుడు ఈ కథ చెప్పి 'రాజా, బసవ య్యను న్యాయాధికారి మొదట దొంగగా అనుమానించి అడవిలోకి తీసుకెళ్లాడా? అడవిలో గొలుసు ఇవ్వబోగా వేటగాడు ఎందుకు తీసుకోలేదు? న్యాయస్థానంలోనే ఎందుకు ఇవ్వమన్నాడు? న్యాయస్థానంలో ఇవ్వబోగా వద్దని సరుకులు, బట్టలు మాత్రమే ఎందుకు కోరాడు? బంగారం విలువ తెలియకనా? ఈ ప్రశ్నకు సమా ధానం తెలిసి కూడా చెప్పక పోయావో నీ తల వేయి వక్కలవుతుంది,' అన్నాడు.

అప్పుడు విక్రమార్కుడు, 'న్యాయాధి

కారి సభలోనే బసవయ్య తడబడకుండా సమాధానాలు చెప్పిన తీరుకు అతడు వేటగాడనే నమ్మాడు. కానీ జనానికి నమ్మకం కలిగించడం కోసం మురారి బావమరిదిని తీసుకుని అడవికి వెళ్లాడే గాని భయంతో రక్షణ కోసం కాదు. దొంగని అనుమానిస్తే వెళ్ళేవాడే కాదు.

అడవిలో హారం ఇవ్వబోగా వద్దన్న బసవయ్య దానిని సభలో ఇమ్మని కోరింది తన నిర్దోషిత్వం నిరూపించుకోవడం కోసమే. అడవిలో గొలుసు తీసుకుని ఎవరి ఇళ్లకు వాళ్లు వెళ్లిపోతే, జనానికి నిజం తెలియక దొంగలాగే అనుమానిస్తారు. అందుకేసభలో ఇవ్వమని కోరాడు.

ఇంక ఆ పులి సంఘటన న్యాయాధికారి గాని, వేటగాడు గాని అసలు ఊహించలేదు. తన ప్రాణాల్ని కాపాడాడనే కృతజ్ఞతతో న్యాయాధికారి హారం ఇద్దామనుకున్నాడు. సభలో హారాన్ని ఇస్తున్నా బసవయ్య వద్దనడానికి కారణం, వేటగాడు దాన్ని ఎల్లకాలమూ ధరించడు. ఏనాటికైనా హారాన్ని అమ్మి కుటుంబ అవసరాలు తీర్చుకోవలసిందే.

వెంటనే అమ్మితే న్యాయాధికారికి బాధ అనిపించొచ్చు. జనానికి ఈర్ష్య, అనుమానం కలగొచ్చు. తన కుటుంబం గడపడానికి మాత్రమే సరుకులు కావాలి. బంగారం ఎప్పుడూ కోరుకోలేదు. అందుకే హారం వద్దని సరుకులు, వస్త్రాలు మాత్రం ఇప్పించమని అడిగాడు.

న్యాయాధికారి మురారి భార్యకు భర్త హారం ఇప్పించి, వేటగాడికి కావలసిన వస్తువులు కూడా ఇప్పించి, ఇద్దరికీ సరైన న్యాయం చేశాడు,' అని చెప్పాడు.

బేతాళుడికి సరైన సమాధానం లభించడంతో శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు.

– కల్పితం

(ఆధారం : పుప్పాల కృష్ణమూర్తి)







# గాడిద జోస్యం

సువర్ణానదీ తీరాన ఒక గ్రామంలో ఒక జ్యోతిష్కుడుండేవాడు. ఆయన పంచాంగాలు గుణించడంలో, ఆ చుట్టుపక్కల మిగిలిన సిద్ధాంతుల కన్న చాలా గొప్పవాడని పేరు వచ్చింది. తరవాత జాతకాలు రాయటంలో అంతటి వాడు లేడని అనసాగారు.

సిద్ధాంతిగారి ఖ్యాతి క్రమంగా రాజధానికి పాకింది. అక్కడ ఉండే రాజోద్యోగులంతా కలిసి ఆయనను రాజధానికి రప్పించారు. కొద్ది కాలంలోనే సిద్ధాంతిగారికి రాజాశ్రయం కూడా దొరికింది. ఆయన చెప్పిన జోస్యానికి తిరుగు ఉండేది కాదు.

క్రమంగా సిద్ధాంతి గారు అధికారుల అనుగ్రహమూ, బోలెడంత డబ్బూ సంపాదించుకుని నదీ తీరాన తన స్వగ్రామంలో అనేక వందల ఎకరాల భూమికి హక్కుదారైనాడు. పంటలొచ్చే తరుణంలో మాత్రం సిద్ధాంతిగారు స్వగ్రామానికి వెళ్లి, చేలు కోయించి, కుప్పలు వేయించి, నూర్పిళ్లు చేయించి, ధాన్యం కొట్లలో వేయించి, దాని అమ్మకానికి ఏర్పాట్లు పూర్తి చేసుకుని రాజధానికి తిరిగి పోతుండేవాడు.

ఒక ఏడు ఆయన ఈవిధంగానే తన గ్రామం వెళ్లాడు. కుప్పలన్నీ నూర్చి ధాన్యమంతా పొలాల్లోనే రాసి పోశారు. మధ్యాన్న భోజనం అయాక ఒక కునుకు తీసి లేచి, సిద్ధాంతి గారు చల్లగాలికి వసారాలో వచ్చి కూచున్నాడు.

ఆ సమయానికి ఊరి చాకలి ఉతికిన బట్టలు గాడిదపైన వేసుకుని ఇంటికి పోతూ, సిద్ధాంతి గారిని చూసి ఆగి, 'ఏం

టి. ప్రభాకరరావు

బాబూ? ధాన్యమంతా పొలంలోనే ఉన్నట్లుంది. త్వరగా ఇల్లు చేర్పించండి! ఇంకా చూస్తారేం?' అన్నాడు.

'చేర్పిస్తాను. ఇప్పుడేం తొందర వచ్చిందిరా?' అన్నాడు సిద్ధాంతిగారు.

'తొందర కాకేమండీ? ఇంకో గంటలో భయంకరమైన తుఫాను ముంచుకొస్తుంటేనూ?' అన్నాడు చాకలి అదుర్దాగా.

సిద్ధాంతి గారు నవ్వి, 'నీ జోస్యం అఘోరించినట్టే ఉంది. ఈ కార్తెలో వానలే ఉండవు గదా. తుఫాను రావడమేమిటి? ఆకాశం చూడు, ఎంత నిర్మలంగా ఉందో! ఎక్కడా ఒక్క మబ్బు తునక లేదు. మంద మారుతం వీస్తున్నది! తెలిసీ తెలియని విషయాలు పెద్దలతో ఎన్నడూ చెప్పకు!' అన్నాడు.

'మీ మంచికోరే చెబుతున్నాను. కార్తెల సంగతి నే నెరగను కాని, ఇంకో రెండు గడియలలో తుఫాను రావటం మటుకు నిజం. వెంటనే బళ్లను పొలానికి తోలించి ఒక్క గింజ దిగబడకుండా ధాన్యమంతా ఇంటికి తెప్పించుకోండి. లేకపోతే, బంగారం లాంటి పంట నిష్కారణంగా పాడైపోతుంది!' అంటూ చాకలి తన గాడిదను అదిలించి తన దారిన ముందుకు సాగిపోయాడు.

సిద్ధాంతి గారు వాడి అమాయకత్వానికి నవ్వుకుంటూ మళ్లీ ఒక్కసారి ఆకాశాన్ని కలయజూశాడు. పడమటగా చిటికెన వేలంత మబ్బు ఒకటి కనిపించింది. మరి కాస్సేపటికల్లా, అడవి ఏనుగుల మందలాగా కారుమేఘాలు వాయువేగంతో అన్ని





వైపుల నుంచి వచ్చి కమ్ముకున్నాయి. సూర్యుడు ఎక్కడ ఉన్నదీ తెలియరాలేదు. ప్రపంచం చీకటిపడినట్లయి పోయింది. పెద్ద పెద్ద మానులను కూకటి వేళ్లతో సహా పెకిలించగల హోరుగాలి సాగింది. ఆకాశాన ఉరుములూ, మెరుపులూ సాగి వాన ఆరంభమయింది.

సిద్ధాంతి గారికి ఏమి చేయాలో తోచలేదు. చాకలి చెప్పినప్పుడే ధాన్యం చేరవేసుకుని ఉంటే ఏమీ నష్టం ఉండేది కాదు. కాని పంచాగం ప్రకారం ఈ సమయంలో వానలుండటానికి వీలులేదు గనక సిద్ధాంతి గారు చాకలి మాట లక్ష్యపెట్టలేదు.

అన్నట్టు ఈ తుఫాను వస్తుందని చాకలికి గంటకిందటే ఎలా తెలిసింది? అని సిద్ధాంతి గారు ఆశ్చర్య పడ్డారు. తుఫాను కాస్త తగ్గగానే ఆయన చాకలి ఇంటికి పరిగెత్తివెళ్లి, 'ఒరే చాకలీ? నువు చెప్పినట్లే చిత్రంగా వాన వచ్చిందే! నీకు తప్పక జోస్యం తెలిసి ఉండాలి. ఎవరి దగ్గర నేర్చుకున్నావురా?' అని అడిగాడు.

'మరెవరోనా బాబూ, నా గాడిదే నాకు జోస్యం చెబుతుంది. దాని ముందు ఏ పంచాంగాలు పనికిరావు. ఇంకో మూడు నాలుగు గడియల్లో వాన రాబోతోందనగా దాని వంటిమీదున్న రోమాలన్నీ నిలబడతాయి. అది చెవులూ, కళ్లూ పైకి తిప్పి మనకు వినబడని వానకోసం ఆలకిస్తుంది. తరవాత తోకను ముడిచి అటూ ఇటూ చిందులు తొక్కుతుంది! దాని జోస్యానికి తిరుగులేదు బాబూ!' అన్నాడు చాకలి.

సిద్ధాంతి వెళ్లిపోతూ, 'ఒరే, నీకు పుణ్యముంటుంది. ఇవాళ జరిగిన సంగతి ఎవరికీ చెప్పకు. నా పరువు కాస్తా పోతుంది.' అని చాకలిని బతిమాలుకున్నాడు. కాని ఈ సంగతి అందరికీ తెలియనే తెలిసింది. సిద్ధాంతిగారి దగ్గిర జరగబోయే విషయాలు తెలుసుకునేవారు క్రమంగా తగ్గిపోయారు.





# విలువైన నిధి

దండకారణ్యానికి తూర్పు దిక్కుగా పర్వత సానువుల మధ్యలో ఉన్న చంద్రవరం గ్రామంలో సోముడనే యువకుడు ఉండేవాడు. తల్లిదండ్రులు మరణించేనాటికి ఒక పాత ఇల్లూ, దానినానుకుని కొంత పంటపొలమూ మిగిలాయి వాడికి.

స్వతహాగా బద్ధకస్తుడు కావడంతో పగలంతా రచ్చబండ మీదా, గుడి ప్రాంగణంలోనూ గడుపుతూ, ఎవరైనా జాలిపడి ఇంత పెడితే తిని రాత్రికి వారింట్లో పడుకుని కాలం గడుపుతూండేవాడు సోముడు.

ఒకరోజు రాత్రి సోముడు మంచి నిద్రలో ఉండగా అటకమీద ఎలుకలు చేసిన చప్పుడుకు మెలకువ వచ్చి అటక ఎక్కి చూడగా పాతకాలం నాటి పెట్టె ఒకటి కనిపించింది. దానిని చూడగానే వాడికళ్లు ఆనందంతో మెరిశాయి. అంతకాలమూ దానిని గమనించనందుకు తనను తాను నిందించుకుంటూ ఎలాగోలా కష్టపడి ఆ పెట్టెను అటకమీదినుంచి కిందికి దించాడు.

కానీ దాన్ని తెరిచి చూశాక అందులో కనిపించిన పనికిరాని పాత సామాన్లు వాడికి అంతులేని నిరాశను కలిగించాయి. నిద్రాభంగం చేసిన ఎలుకల్ని తిట్టుకుంటూ అన్యమనస్కంగా ఒకొక వస్తువునూ తీసి బయట పెట్టినవాడికి పెట్టె అడుగున ఒక తాళపత్రం కనిపించింది.

ఆ తాళపత్రంలో ఉన్న విషయాన్ని ఆకళింపు చేసుకున్నవాడికి అంతులేని ఆనందం కలిగింది. చంద్రవరం గ్రామానికి పశ్చిమ దిశగా ఉన్న కొండల మధ్య ఉండే లోయలో ఒకశిథిలాయంలో గొప్పనిధి ఉన్నదని వాడికి ఆ పత్రం ద్వారా తెలిసింది.

కానీ అక్కడికి ఎలా వెళ్లాలో తెలియజేసే

సీతాసత్య





వివరాలు ఆ తాళపత్రంలో లేవు. సోముడు దిగులు పడకుండా మరునాడు తెల్లవారు జామునే బయలుదేరి ఊరికి పశ్చిమ దిశగా నడిచి ఓ గ్రామం చేరుకున్నాడు.

చాలాదూరం నడవటం వలన వాడికి నీరసం ముంచుకొచ్చింది. ఒకరిద్దరు గ్రామస్థులను, తినేందుకు ఏమైనా పెట్టమనీ అడిగాడు. వారు ఊరి పెద్ద భూమయ్యను కలవమని చెప్పారు.

సోముడు భూమయ్యను క
తనకింత అన్నం పెట్టమని బ్రతి
న్నాడు. భూమయ్య వాడిని ఎగాది
తర్వాత భోజనాలు పెట్టించాడు

షడ్రసోపేతమైన భోజనాన్ని ఆ
'ఊరు కాని ఊళ్లో నామీద ఇ
చూపించిన మీ రుణం ఎలా తీర్చుకోవాలో తెలియడం లేదు,' అన్నాడు సోముడు.

'నాకు తెలుసులే! అలా పెరట్లోకి వెళ్లి పశువులపాకను శుభ్రంగా ఊడ్చి, పశువులను శుభ్రంగా కడిగి కొట్టంలో కట్టేస్తే నా రుణంలో సగం తీరుతుంది,' అన్నాడు భూమయ్య.

ఒక్క క్షణం తెల్లబోయినా భూమయ్య చెప్పిన పనిని పూర్తి చేసేసరికి అలవాటు లేని కారణాన వాడికి ఒళ్లంతా నొప్పులు పుట్టి భూమయ్య ఇంటి అరుగు మీదే ఒళ్లెరక్కుండా నిద్రపోయాడు.

మర్నాడు ఎవరో తట్టి లేపినట్టనిపించి లేచి కూర్చున్నాడు సోముడు.

చేతికర్రతో అతడి భుజంమీద పొడుస్తూ.. 'లే.. లే... బారెడు పొద్దెక్కింది. పశువులనలా కాసేపు అడవిలో తిప్పి తోలుకురా,' అన్నాడు భూమయ్య.

దిక్కులు చూస్తున్న సోముడితో, 'నా రుణంలో సగం బాకీ అలానే ఉందనే సంగతిని మరిచిపోయావా ఏంటి?' అని హుంకరించాడు భూమయ్య.

పశువుల్ని తోలుకుని దాపులనున్న అడవికి వెళ్లక తప్పలేదు సోముడికి.

అలా వారం రోజుల పాటుగా ఉదయం తిన్న తిండికి సాయంత్రం, సాయంత్రం తిన్న తిండికి మర్నాడు ఉదయం పనిచేసినా అతడి బాకీ సగానికి సగం అలానే ఉండిపోతూ వచ్చింది.

ఈ వెట్టి చాకిరీ చేయడం కంటే పస్తులుండటమే నయమనిపించి ఒక రోజున ఎవరికీ చెప్పకుండా పశువుల్ని కొట్టంలో



కట్టివేశాక ఊరు వదలి పారిపోయి ఊపిరి పీల్చుకున్నాడు సోముడు.

కొంతదూరం నడిచాక వాడికి ఒకసాధువు ఎదురొచ్చాడు. సాధువుకు సాష్టాంగ నమస్కారం చేసి, 'ఇక్కడెక్కడో ఒక శిథిలాలయం ఉన్నదని విన్నాను. అక్కడికి నాకు దారి చూపించి పుణ్యం మూటకట్టుకోండి స్వామీ,' అన్నాడు సోముడు.

అందుకా సాధువు నవ్వి, సమాధానం చెప్పకుండా ముందుకు నడిచాడు.

'మరేం చేస్తే నాకు దారి చూపిస్తారో అదయినా చెప్పండి స్వామీ!' అని బ్రతిమాలాడు సోముడు.

తనతో రమ్మని చెప్పి తన ఆశ్రమానికి తీసుకువెళ్లి అతడు చేయవలసిన పనుల్ని వివరించాడు సాధువు.

రోజూ చీకటితోనే లేచి ఆశ్రమం శుభ్రం చేయటం, వాగు నుంచి నీరు తెచ్చి ఆశ్రమంలో ఉన్న పాత్రలన్నీ నింపటం, అడవి నుంచి తేనె, పళ్లూ, దుంపలూ సేకరించటం, సాధువుకు కావాల్సిన ఇతర ఏర్పాట్లన్నీ చూడటం, ఈ పనులతో సోముడికి క్షణం కూడా తీరిక దొరికేది కాదు.

సాధువు కూడా అతడి పరిచర్యల వలన సంతోషించినట్లే కనిపించాడు. ఒక రోజు రాత్రి తన కాళ్లు పడుతూ నిద్రకు జోగుతున్న సోముడి తలమీద చేయివేసి, 'ఏదో ఆలయానికి దారి అడిగినట్లుగా ఉన్నావు. ఇప్పట్లో అక్కడికి వెళ్లే ఉద్దేశం లేదా ఏం?' అన్నాడు సాధువు.

'మీరు ఆ మాట ఎప్పుడంటారా అని ఎదురు చూస్తున్నాను స్వామీ,' అన్నాడు సోముడు వినయంగా.

'ఇంతకూ అక్కడికి వెళ్లి ఏం చేయాలనుకుంటున్నావో చెప్పనే లేదు నువ్వు,' అన్నాడు సాధువు.

సోముడు గతుక్కుమని, 'అది పరమ రహస్యం స్వామీ!' అన్నాడు.

'నువ్వక్కడికి వెళ్లాలనుకుంటున్నది నిధి గురించి కాదు కదా?' అన్నాడు సాధువు కళ్లు తెరిచి.

సోముడు రెండు చేతులూ పైకెత్తి, 'విషయాన్ని మీ వద్ద దాచి పెట్టినందుకు నన్ను మన్నించండి స్వామీ. నేను అక్కడికి వెళ్లాలనుకుంటున్నది నిధికోసమే,' అన్నాడు.

'గతంలో నీలానే చాలామంది అక్కడికి వెళ్లి ఉత్తచేతులతో తిరిగి వచ్చారు నాయనా! నువ్వక్కడికి వెళ్లడం వలన ఏమీ ప్రయోజనం ఉండబోదు,' అన్నాడు సాధువు. సోముడిని జాలిగా చూస్తూ.

'నేనక్కడికి వెళ్లి తీరాలి స్వామీ! నాకు పట్టిన దరిద్రాన్ని వదిలించుకోవాలంటే అదొక్కటే మార్గం!' అన్నాడు సోముడు.

'సరే అయితే విను,' అంటూ శిథిలాలయానికి వెళ్లేందుకు అవసరమైన వివరాలు చెప్పాడు సాధువు. ఆ రాత్రికి ఆశ్రమంలోనే విశ్రమించి మర్నాడు ఉదయాన్నే శిథిలాలయానికి బయలుదేరాడు సోముడు.

కొండలూ, కోనలూ దాటి భీకరారణ్యం గుండా ప్రయాణించి ఎట్టకేలకు పాడుపడిన ఆలయాన్ని చేరుకున్నాడు సోముడు. ఆలయ ప్రాంగణంలో ఉన్న అమ్మవారి విగ్రహం చుట్టూ ముమ్మారు ప్రదక్షిణం చేసిన తరువాత ఆలయప్రాంగణమంతా ఎంత వెదికి చూసినా నిధి ఉన్న జాడ అతడికి తెలియరాలేదు. సాధువు మాటల్ని మననం చేసుకుంటూ ఆ రాత్రికి అక్కడే విశ్రమించాడు సోముడు.

మర్నాడు ఉదయం లేచి మరింత శ్రద్ధగా ఆలయపు గోడలమీద ఏమైనా వివరాలు దొరుకుతాయేమోనని కళ్లల్లో కళ్లు పెట్టుకుని మరీ వెదికాడు సోముడు. చివరికతడి శ్రమ ఫలించి ఒకచోట రాగిరేకుమీద చెక్కబడి గోడలో తాపడం చేయబడిన ఫలకం కనిపించింది.

ఆత్రుతగా దాన్ని చదివాడు సోముడు. దానిమీద ఇలా చెక్కబడి ఉంది. 'ఇప్పుడు నీకు కష్టం విలువ తెలిసింది. దీనికంటే విలువైన నిధి ఎక్కడైనా ఉన్నదని ఎవరైనా చెప్పినా నమ్మకు!'

దానిని చూసినవెంటనే అంతులేని నిరాశ కలిగింది సోముడికి. స్థిమితంగా ఆలోచించగా అందులోని గూడార్థం అవగతమైంది వాడికి. వెంటనే వెనుదిరిగి ఊరికి ప్రయాణమయ్యాడు.

తరువాత క్రమేణా బద్ధకాన్ని వదుల్చుకుని తల్లిదండ్రుల నుంచి సంక్రమించిన పంటభూమిని సాగు చేసుకుంటూ సుఖసంతోషాలతో జీవించాడు సోముడు.





# పంచతంత్ర కథలు

దొంగలనాయకుడు చెప్పినట్లే అతని అనుచరులు రాజు కొడుకునూ, మంత్రి కొడుకునూ, కోశాధికారి కొడుకునూ, వారి వెంట వస్తున్న సుబుద్ధినీ పట్టుకుని తీసుకువచ్చారు.

దొంగల నాయకుడు వాళ్లను సోదా చేస్తే అతనికి ఏమీ దొరకలేదు. అందుచేత అతను తనకు నచ్చిన పైపంచ ఒకటి తీసుకుని, నలుగురినీ వదిలి పెట్టాడు.

వాళ్లు వెళ్లిపోతుంటే పక్షి మళ్లీ అరిచింది. నాయకుడు వాళ్లను మళ్లీ తెప్పించి, మరింత శ్రద్ధగా సోదా చేశాడు. కాని అతనికి ఏమీ దొరకలేదు. అతను వాళ్లను మళ్లీ వదిలేశాడు. వాళ్లు పోతుంటే ఈసారి పక్షి మరింత గట్టిగా అరిచింది. నాయకుడు వాళ్లను మళ్లీ తెప్పించి, 'మీ వద్ద మణులున్నాయని పక్షి చెబుతున్నది. అవి ఎక్కడ?' అని అడిగాడు.

'మా దగ్గర మణులుంటే నువు సోదా చేసినప్పుడు దొరకవా?' అన్నారు వాళ్లు.

'పక్షి పదేపదే చెబుతున్నది గనక మీ వద్ద మణులు ఉండి తీరాలి. అవి మీ వంటి మీదే లేవు గనక, మీరు వాటిని మింగి ఉంటారు. ఇప్పుడు చీకటి పడుతున్నది. రేపు ఉదయమే మీ పొట్టలు చీల్చి మణులు ఉన్నాయో లేదో చూస్తాను,' అంటూ దొంగలనాయకుడు వారిని ఒక కొట్టులో బంధింపజేశాడు.

ఆ రాత్రి కొట్టులో చాలా సేపు మేలుకుని సుబుద్ధి ఇలా ఆలోచించాడు.

రేపు ఉదయం ఈ దొంగ మిగిలిన ముగ్గురి పొట్టలూ చీల్చి, అందులో మణులున్న సంగతి గ్రహించినమీదట, నా పొట్టలో కూడా ఒక మణి ఉంటుందన్న ఆశతో నన్ను కూడా చీల్చుతాడు. ఎలాగూ నా చావు తప్పదు. నేను ఏం చేయాలి? బుద్ధిమంతులు తమ చావు తప్పదని తెలిసినప్పుడు ఎవరికైనా మేలు చేసి ఉత్తమలోకాలు సంపాదించుకుంటారని పెద్దలు చెబుతుంటారు. అందుచేత రేపు ఉదయం దొంగలనాయకుడిని మొదట నా పొట్టనే చీల్చనిస్తే, మిగిలిన ముగ్గురూ బతికిపోతారు. నా పొట్టలో మణి దొరకకపోయేసరికి దొంగలనాయకుడికి పక్షి జోస్యంలో నమ్మకం పోతుంది. వాడు విరక్తితో మిగిలిన ముగ్గురినీ విడిచిపుచ్చుతాడు. వాళ్ల ధన ప్రాణాలు దక్కించినందుకు నా కీర్తి ఇహంలోనూ, పరంలోనూ కూడా వ్యాపిస్తుంది. నా పాపాలన్నీ పరిహారం అయిపోతాయి. రానున్న చావును బుద్ధిమంతుడు ఎదుర్కొనటానికి ఇంత కన్న మేలైన మార్గం లేదు.

ఇలా అనుకుని సుబుద్ధి మిగిలిన వాళ్లకు నిజం చెప్పేసి, తన ఎత్తు వివరించాడు. వాళ్లు మళ్లీ మళ్లీ కృతజ్ఞతలు తెలుపుకున్నారు.

తెల్లవారగానే దొంగల నాయకుడు ఆ నలుగురినీ తన వద్దకు రప్పించి, పొట్టలు చీల్చే సన్నాహం చేశాడు.

అప్పుడు సుబుద్ధి చేతులు జోడించి దొంగల నాయకుడితో, 'నా కళ్ల ముందు నా సోదరుల పొట్టలు చీలటం నేను భరించలేను. నాయందు అనుగ్రహం ఉంచి ముందు నా పొట్ట చీల్చు', అన్నాడు.



మిత్రభేదం - 31

దొంగల నాయకుడు అతన్ని కనికరించి, ముందుగా అతని పొట్టనే చీల్చాడు. కాని ఎంత వెతికినా అందులో మణి లేదు.

ఇది చూసి దొంగల నాయకుడు పశ్చాత్తాపంతో కుమిలిపోతూ, 'అయ్యో, పక్షిని నమ్మి, ధనాశతో ఎంత పాపిష్టి పనిచేశాను. మిగిలిన వాళ్ల పొట్టలలో కూడా రత్నాలు ఉండవు. వారిని హింసించటం వృథా!' అనుకుని వారిని విడిచిపుచ్చాడు.

ఆ ముగ్గురూ క్షేమంగా అరణ్యం దాటి రత్నపురం చేరి, ఒక సత్రంలో బసచేసి, ఆముదం తాగి తమ మణులను తిరిగి పొందారు. కోశాధికారి కొడుకు వాటిని ఆ నగరంలోని వర్తకులకు అంతులేని ధనానికి అమ్మి, ఆ ధనమంతా రాజు కొడుక్కు ఇచ్చాడు.

ఆ సమయంలో రత్నపురాన్ని ఏలుతున్నవాడు ఒక రాజద్రోహి. వాడు రాజవంశాన్ని నిర్మూలించి, రాజ్యం కాజేసి ప్రజా కంటకుడుగా పాలిస్తున్నాడు. అందుచేత రత్నపుర రాజ్యాన్ని జయించాలని రాజు కొడుకుకు ఆలోచన కలిగింది. అతను మంత్రి కుమారుడిని తన మంత్రిగానూ, కోశాధికారి కొడుకును తన కోశాధికారిగానూ నియమించాడు.

వారు ముగ్గురూ పొరుగు రాజ్యానికి వెళ్ళి, డబ్బు మంచినీరు లాగా ఖర్చు చేసి, చతురంగ బలాలను సమకూర్చుకున్నారు. ఈ సైన్యంతో వారు రత్నపురం మీదికి దండెత్తి వచ్చారు.

రత్నపుర రాజ్యం వారి వశమయింది. తరవాత రాజకుమారుడికి వైభవంగా రాజ్యాభిషేకం జరిగింది. అతను పొరుగు రాజుకూతురిని పెళ్లి చేసుకున్నాడు కూడా. అటుపిమ్మట అతను రాజకార్యాలను తన మిత్రులిద్దరి మీదా వదిలి, తన కొత్త భార్యతో గడుపుతూ సుఖసౌఖ్యాలలో తేలిపోసాగాడు.

(ఇంకా వుంది)







మొఘల్ చక్రవర్తి జహ వెంటనే గొడ్డలి కొన రంగు

చరిత్ర 'తుజుక్-ఇ-జహంగిరి' లో పరుసవేది గురించి ఒక ఆసక్తికరమైన పిట్టకథను పేర్కొన్నాడు. ఇనుముతో తయారుచేసిన ఏ వస్తువునైనా పరుసవేదికి తాకిస్తే చాలు ఆ వస్తువు బంగారుగా మారుతుందని నానుడి. దీంతో పరుసవేదిపై కథలు, కల్పనలకు అంతే ఉండేది కాదు.

పూర్వం, దక్షిణ భారతదేశంలో మండూ అనే పర్వత ప్రాంతముండేది. ఈ ప్రాంతంలోని ఒక గ్రామంలో కట్టెలు కొట్టేవాడు ఉండేవాడు. ఇతడు నిరుపేద. ప్రతి రోజూ ఉదయాన్నే అతడు గొడ్డలి చేతపట్టుకుని చెట్లు నరికేందుకు అడివికి వెళ్లేవాడు. కలపను పట్టణంలో అమ్మి జీవించేవాడు.

ఒకరోజు ఓ చెట్టును నరుకుతుండగా చేతిలోని గొడ్డలి ఒక చిన్న ముక్కకి తగిలి

మారిపోయింది. కట్టెలు కొట్టేవాడు నిర్ఘాంతపోయాడు. అలాంటి గొడ్డలితో తానిక చెట్లు ఎలా నరకగలడు? అతడు గొడ్డలిని తీసుకుని కంసాలి వద్దకు పరుగెత్తాడు. 'అన్నా, నాకు ఎలాంటి గొడ్డలిని చేసి ఇచ్చావో చూడు! చిన్న ముక్క తగలగానే ఇదెలా అయిందో చూడు!'

గొడ్డలి రంగు చూడగానే కంసాలి కళ్లు మెరిశాయి. అతడు కట్టెలు కొట్టేవాడి చేతిలోని గొడ్డలిని తీసుకుని పరీక్షగా చూశాడు. 'అవును తమ్ముడూ, గొడ్డలి ఇలా మారినందుకు నాదే తప్పు. ఇనుమును సానబట్టడంలో ఏదో తప్పు జరిగినట్లుంది' అంటూ కంసాలి కట్టెలు కొట్టేవాడికి హామీ ఇచ్చాడు. 'దిగులు పడవద్దు. నీకు కొత్త గొడ్డలిని చేయిస్తాను' అన్నాడు

అమితాబ దాస్‌గుప్త



కంసాలి. కట్టెలు కొట్టేవాడు తనకు కొత్త గొడ్డలి వస్తుందని విని సంతోషించాడు.

అప్పుడు కంసాలి అడిగాడు. 'నీ గొడ్డలిని తాకిన వస్తువేదో కాస్త చూపగలవా?' దానికి కట్టెలు కొట్టేవాడు ఆశ్చర్యపడి, 'ఎందుకు చూపనూ, నాతో రా అన్నా' అని కంసాలిని పిలుచుకుపోయాడు.

కంసాలితో పాటు అడవిలోకి వచ్చిన కట్టెలు కొట్టేవాడు అక్కడ ఒక చెట్టు కింది చిన్న చిన్న ముక్కను చూపి, 'ఇదే అన్నా నా గొడ్డలిని తాకింది' అన్నాడు.

'ఆ ముక్కను తీసి నాకివ్వు, అదేమిటో చూస్తాను!' అన్నాడు కంసాలి. కట్టెలు కొట్టేవాడు అలాగే తీసి ఇచ్చాడు. దాన్ని చూడగానే కంసాలి తన ముఖకవళికలను దాచిపెట్టుకుని చెప్పాడు. 'దీన్ని మాఇంటికి తీసుకెళతాను. ఇనుమును నునుపు చేయడానికి, శుభ్రపర్చడానికి ఇది ఉపయోగపడుతుందేమో చూస్తాను.'

కంసాలి చాలా తెలివైన వాడు. గొడ్డలిని చూడగానే అది బంగారుగా మారినట్లు అతడు గుర్తించాడు. తర్వాత ఆముక్కని తీసుకుని ఇంటికి వెళ్లగానే దాన్ని ఇనుప వస్తువులకు తాకించాడు. తప్పకుండా అది పరుసవేది అని ధృవపర్చుకున్నాడు.

కంసాలికి సుడి తిరిగినట్లయింది. బంగారును అమ్మగా వచ్చిన డబ్బుతో మండూ ప్రాంతంలో భూమి కొనుగోలు చేసి పెద్ద భవంతిని కట్టుకున్నాడు. దాంట్లో చాలా మంది పనివాళ్లను, సేవకులను నియమించాడు. రోజురోజుకూ తన సంపద, పలుకుబడి పెరుగుతూ వచ్చింది. త్వరలోనే అతడు మండూ రాజు అయ్యాడు.

మండూ పొరుగున బొర్హన్‌పూర్ అనే రాజ్యం ఉండేది. ఈ రెండు రాజ్యాలకు మధ్య నర్మదా నది ఉండేది. మండూ రాజు కుమార్తెను తన కుమారుడికి ఇచ్చి పెళ్లి చేయవలసిందిగా కోరుతూ బొర్హన్‌పూర్ రాజు ప్రతిపాదన పంపాడు. కంసాలి రాజ వెంటనే ఈ ప్రతిపాదనను అంగీకరించాడు. ఒక శుభముహూర్తాన బొర్హాన్‌పూర్ యువ రాజు మండూ రాజకుమార్తెను పెళ్లాడాడు.

కుమార్తెను అత్తవారింటికి పంపేటప్పుడు కంసాలి రాజు తన వద్ద ఉన్న పరుసవేదిని చెక్కపెట్టెలో ఉంచి కూతురు చేతిలో పెట్టాడు. 'అమ్మా! దీనిని మీ మామగారికి ఇవ్వు. ఇది నా బహుమతిగా ఆయనతో చెప్పు' అన్నాడు. తర్వాత దాని వెనుక రహస్యం గురించి అతడు తన కుమార్తెకు చెప్పాడు.

బొర్హన్‌పూర్ రాజు తన కోడలికి ఆహ్వానం పలికేందుకు నర్మదా నది గట్టువద్ద వేచి చూస్తున్నాడు. గట్టు చేరగానే కంసాలి రాజు కుమార్తె తన వద్ద ఉన్న చెక్క పెట్టెను రాజుకు అప్పగించింది. 'మా తండ్రి దీనిని మీకు బహుమతిగా పంపాడ'ని చెప్పింది.

ఆసక్తితో బొర్హన్‌పూర్ రాజు ఆ పెట్టెను తెరిచి చూశాడు. పెట్టెలోపల వస్తువును చూడగానే అతడు ఆగ్రహించాడు. మండూ రాజు తనను అపహాస్యం చేయడానికి దాన్ని పంపాడని అతడు భావించాడు. కంసాలి కుమార్తె దాని గురించి చెప్పే లోపే ఆ ముక్కను నర్మదా నదిలోకి విసిరేశాడు. కంసాలి కుమార్తె విషాదంతో ఏడ్చేసింది. అది పరుసవేది అని తన మామగారికి చెప్పింది. రాజు తన తప్పు గ్రహించి పశ్చాత్తాపపడ్డాడు. నర్మదా నది నీటిలోపల ఆ వస్తువు కోసం వెతకమని గజఈతగాళ్లకు ఆదేశించాడు. కాని ఎంత వెతికినా అది ఎవరికీ దొరకలేదు.

జహంగీర్ తన ఆత్మకథలో ఈ విషయం పేర్కొంటూ, ఈ ఘటన జరిగిన చాలా ఏళ్ల తర్వాత అక్బర్ చక్రవర్తి బొర్హన్‌పూర్ రాజుతో యుద్ధానికి దిగాడని రాశాడు. అక్బర్ సేనలు ఒకసారి నర్మదానదిని దాటుతున్నప్పుడు ఒక ఏనుగు ఉన్నట్లుండి మతి తప్పి దూకుడుగా వ్యవహరించింది. సైన్యాధికారి ఆదేశం మేరకు ఏనుగు కాళ్లను ఇనుప గొలుసుతో కట్టేశారు. ఏనుగుల మంద నర్మదా నదిని దాటుతున్నప్పుడు ఆ ఏనుగు కాళ్లను కట్టి ఉంచిన గొలుసు బంగారుగా మారడం కనిపించింది. ఈ వింతను తర్వాత అక్బర్ చక్రవర్తి చెవిన వేశారు. ఇలా పరుసవేది గురించి చాటువు అక్బర్ వరకు వెళ్లింది.

అక్బర్ చక్రవర్తి నర్మదా నది నీటి అడుగు ప్రాంతాన్ని వెతకవలసిందిగా ఈతగాళ్లను ఆదేశించాడు. రాత్రింబవళ్లూ వారు నీటిలో వెతికారు కాని ఆ పరుసవేది వారెవరికీ దొరకలేదు.





# చిత్రకారుల యుక్తి

పూర్వం జయవిజయులని ఇద్దరు చిత్రకారులుండేవారు. వారు ప్రతిభావంతులు. వారు ఏ కొత్త మనిషినైనా సరే కొద్దిసేపు చూసి ఆ మనిషి రూపం చిత్రించగలిగేవారు. తాము చూడని మనిషిని సైతం వర్ణించగా విని, ఎరిగినవాళ్లు పోల్చుకునేలాగ చిత్రించగలిగేవారు.

వారు తమ అపూర్వ శక్తులను అనేక రాజాస్థానాలలో ప్రదర్శించి ఎన్నో బిరుదులూ బహుమానాలూ పొందుతూ దేశాటన చేశారు.

ఒకనాడు వారు మాధవవర్మ అనే రాజు యొక్క ఆస్థానానికి వచ్చి అక్కడకూడా తన ప్రజ్ఞను ప్రదర్శించారు.

మాధవవర్మ వారితో, 'మీరు ప్రతిభావంతులని నేను నమ్ముతున్నాను. అయితే మీకొక చిన్న పరీక్ష పెడతాను. అన్ని రకాల జ్ఞానం కంటే కూడా ఆత్మజ్ఞానం గొప్పదని పెద్దలు చెబుతారు. ఇది కళలలో కూడా నిజమేనని నా ఉద్దేశం. మీరు నిజంగా ప్రతిభావంతులే అయితే మీరు మీ చిత్తరువులనే వేసి నాకు చూపించండి. అవి వాస్తవాన్ని పోలి ఉన్నట్లయితే నేను మీకు నిజంగా మంచి బహుమానం ఇచ్చి సత్కరిస్తాను,' అన్నాడు.

ఈ మాటలకు జయ విజయులు తెల్లబోయినట్లు కనబడ్డారు.

'మీరు తరచు మీ ముఖాలను అద్దాలలో చూసుకుంటూనే ఉంటారు కదా! ఆ ముఖాలను చిత్రించడం మీకేమంత కష్టం? అలా కనిపించి వెళ్లిపోయిన దాసీదాని చిత్తరువు అచ్చు గుద్దినట్లు వేశారే. అంత కన్న ఇది కష్టమైన పని కాదు,' అన్నాడు మాధవవర్మ.

జయవిజయులు ఒకరినొకరు చూసుకున్నారు. ఒకరి ముఖాలొకరు పరీక్షించుకున్నారు. వారి కళ్లు ఏమో మాట్లాడుకున్నాయి.

'సరే మహారాజా! ఈ పరీక్షకు మేము నిలబడతాం!' అన్నారు వారు.

రాజుగారు నౌకర్లను పిలిపించి, 'ఈ చిత్రకారులిద్దరినీ చెరొక గదిలోనూ ఉంచి, చిత్రాలు పూర్తి అయినాక వాటిని నా వద్దకు తీసుకురండి. వారుండే గదులలో అద్దాలు గాని అద్దాలలాటివి గాని ఏమీ లేకుండా చూడండి' అన్నాడు.

రాజుగారి నౌకర్లు వారిని చెరొక ఖాళీ గదికి తీసుకుపోయారు.

ఎవరి ముఖం వారు చిత్రించడం సులువైన పనికాదు. అద్దంలో చూసుకున్నప్పటికీ ప్రతిబింబాలలో కుడి ఎడమలు వ్యత్యాసంగా ఉంటాయి.

ఆ కారణం చేత, జయవిజయులు రాజాజ్ఞ ప్రకారం ఎవరి ముఖం వారు చేసుకోవడానికి ప్రయత్నించినట్లయితే ఫలితం సరిగా ఉండేది కాదు.

అయితే వారు ఆ పని చేయడానికి ప్రయత్నించలేదు. విజయుడి ముఖాన్ని జయుడు, జయుడి ముఖాన్ని విజయుడూ చిత్రించ నారంభించారు.

ఒక్క ఘడియ లోపల ఇద్దరి చిత్రణా ముగిసింది. వారు తమ తమ చిత్రాలను వేరు వేరు పెట్టెలలో పెట్టి నౌకర్లకిచ్చి వాటిని రాజుగారి వద్దకు పంపించారు.

రాజుగారి చేతికి అందగానే రెండు పెట్టెలూ కలిసిపోయాయి. వాటిలో ఉన్న రెండు చిత్తరువులనూ ఆయన చెరొక చేతిలో పట్టుకుని వాటిలో గల వాస్తవ చిత్రణకు దిగ్భ్రమ చెందాడు.

చిత్రకారులు చేసిన యుక్తి ఆయనకు అసలు స్ఫురించనేలేదు.

ఆయన జయవిజయులను సభకు రావించి, వారి శక్తిని ఎంతో కొనియాడి, ఇద్దరికీ ఘనంగా సన్మానం చేసి పంపించాడు.



టి. తాతారావు



# సరి కొత్త శ్లోకం

రాజులసేవ కత్తిమీది సాముపంటిది. కాళిదాసును ప్రాణంతో సమానంగా చూసుకునే భోజరాజుకు కూడా కాళిదాసుపై ఏదో ఆగ్రహం కలిగింది. ఆ కారణంగా కాళిదాసు ధారానగరం విడిచి పోయాడు.

కాళిదాసు వెళ్లిపోయిన అనంతరం భోజరాజు పండిత పరిషత్తులో ఒక రకమైన అరాజకం ఏర్పడింది. ఆ పండితులలో ముగ్గురు చురుకైన వాళ్లు చేరారు.

వారిలో ఒకడు ఏకసంథాగ్రాహి అంటే ఏదైనా ఒకసారి వింటే పట్టెయ్యగలవాడు; రెండోవాడు ద్విసంథాగ్రాహి రెండు సార్లు విని పట్టేస్తాడు; మూడోవాడు మాత్రం త్రిసంథాగ్రాహి.

ఎవరైనా ఊరూపేరూ లేని కవులు ఒక కొత్త శ్లోకం చదివితే భోజరాజు వారికి ఒక లక్ష పారితోషకం ఇచ్చి పంపుతూ ఉండేవాడు. కాని ఈ ముగ్గురూ చేరినాక ఈ ఆచారానికి విఘాతం కలిగింది. ఎందుకంటే ఎవరైనా వచ్చి సభలో శ్లోకం చదివితే ఏక సంథాగ్రాహి లేచి 'ఇది నేను విన్న శ్లోకమే' అని తాను కూడా దానిని చదివేసేవాడు. అప్పటికి రెండుసార్లు విని ఉన్న ద్విసంథాగ్రాహి, 'ఇది పాత శ్లోకమే' అని తాను కూడా చదివేవాడు. అతడి వెనుకగా త్రిసంథాగ్రాహి చదివేవాడు. అది పాత శ్లోకమేనని భోజరాజుకు నమ్మకం కుదిరేది. కొత్తగా వచ్చిన వాడు అవమానం పొంది వెళ్ళిపోయేవాడు.

ఈ విధంగా అనేకమంది పండితులు భోజరాజు దగ్గిర శ్లోకాలు చదివి, బహుమానానికి బదులు పరాభవం పొంది, తిరిగి వెళ్లిపోయారు. ఇలా వెళ్లిపోయిన వారిలో ఒకడు దూరదేశంలో ఉన్న కాళిదాసుకు తటస్థపడ్డాడు.

పండితుడి అనుభవమంతా విని కాళిదాసు చాలా చింతించాడు. తాను అక్కడినుంచి వచ్చిన తర్వాత భోజరాజు ఆస్థానం ఎలా మారిపోయిందీ కాళిదాసుకు చాలా స్పష్టంగా అర్థమయింది.

భోజరాజుకూ, అతని పండితులకూ తగిన శాస్తి చేద్దామని కాళిదాసు నిశ్చయించుకుని, ఒక శ్లోకం రచించి, పండితుడికిచ్చాడు. 'ఈ శ్లోకం తీసుకుపోయి భోజరాజు ఆస్థానంలో చదవండి. మీకు పారితోషకం తప్పక లభిస్తుంది,' అన్నాడు.

పండితుడు ఆ శ్లోకం తీసుకుని ధారానగరం చేసి భోజరాజు ఆస్థానానికి వెళ్లాడు.

'మహారాజా, కొత్త శ్లోకం రచించాను. విని, తగిన పారితోషికం ఇప్పించండి,' అన్నాడు పండితుడు. భోజరాజు శ్లోకం చదవమన్నాడు. పండితుడీ శ్లోకం చదివాడు.

''స్వస్తి, శ్రీ భోజరాజ: త్రిభువనవిదితో
ధార్మికస్తే పితా భూ
త్పిత్రాతే వైగృహీతా నవనవ తిమితా
రత్నకోట్యోమదీయా:
తా మేదేహీతి, రాజన్: సకల బుధజనై
ర్జాయతే సత్యమేత
న్నోవా జానంతితే తన్మమకృతి మధవా
దేహిలక్షంతతోమే,''

(శ్రీ భోజరాజుకు స్వస్తి! ధార్మికుడని మూడులోకాల ప్రసిద్ధిగాంచిన మీ తండ్రిగారు 99 కోట్ల రత్నాలు నావి తీసుకున్నాడు. వాటిని నాకు ఇప్పించు. ఈ మాట




ఎమ్. రామానుజాచారి

నిజమని పండితులందరూ ఎరుగుదురు. ఒకవేళ వారు ఎరగని పక్షంలో నా ఈ శ్లోకానికి అధమం లక్ష అయినా ఇప్పించు.)

ఈ శ్లోకం వినగానే ఏకసంధాగ్రాహి మొదలైన వాళ్లు పెద్ద చిక్కులో పడ్డారు. ఈ శ్లోకం అదివరకే తమకు తెలుసునన్నట్లయితే, భోజరాజు తండ్రి ఈ పండితుడివద్ద 99 కోట్ల రత్నాలు తీసుకుని ఉన్నమాట తమకు అదివరకే తెలిసినట్లు సాక్ష్యం చెప్పినవారవుతారు.

ఆ మాట సమస్త పండితులకూ తెలుసునని శ్లోకంలో ఉన్నది. ఆ శ్లోకం తెలియని వారికి మాత్రమే ఆ మణులమాట తెలియకపోవాలి.

తమకా శ్లోకం తెలియదన్న పక్షంలో అది సరికొత్త శ్లోకమవుతుంది. అప్పుడు భోజరాజు పండితుడికి ఒక లక్షమాత్రమే ఇవ్వవలిసి వస్తుంది.

అందుచేత సభలో అందరూ అది కొత్త శ్లోకమేనని ఒప్పుకున్నారు. భోజరాజు పండితుడికి లక్షపారితోషికం ఇప్పించి, 'అయ్యా, మీరు ఈ శ్లోకం ఈ విధంగా ఎందుకు రాయవలసి వచ్చింది? దీని ఆంతర్యమేమిటి?' అని అడిగాడు.

పండితుడు భోజరాజుతో, తాను పూర్వం వచ్చి ఒక కొత్త శ్లోకం చదివిన సంగతి, తన కథ అంతా విని ఎవరో బ్రాహ్మడు ఈ శ్లోకం రాసి పంపిన సంగతీ చెప్పేశాడు.

ఏక సంథాగ్రాహి, ద్వసంథాగ్రాహి, త్రిసంథాగ్రాహి కలిసి ఆడే నాటకం భోజరాజుకు అర్థమయింది. వీరి మూలంగా ఎందరికి అన్యాయం జరిగిందో?

ఈ శ్లోకం రాసి పంపినది కాళిదాసేనని భోజరాజుకు అనుమానం తగిలింది. ఆయన సపరివారంగా బయలుదేరి ఆ పండితుడి వెంట వెళ్లి కాళిదాసును కలుసుకుని, క్షమాపణ చెప్పుకుని, ధారానగరానికి తిరిగి తెచ్చుకున్నాడు.







# చూపు ఆనని వాళ్లు

ఒక ఊళ్లో ముగ్గురు అన్నదమ్ములు పక్కపక్క ఇళ్లలో నివసిస్తూండేవాళ్లు. ఆ ముగ్గురికీ అపరిమితమైన చత్వారం.

ఏ వస్తువైనా ముక్కు దగ్గిర పెట్టుకుంటే గాని కనిపించేది కాదు.

ఆ అన్నదమ్ములు ముగ్గురూ ఒకనాటి సాయంకాలం పెద్దవాడి ఇంట కలుసుకుని లోకాభిరామాయణం మాట్లాడుతున్నారు. మధ్యలో పెద్దవాడు తన తమ్ములతో, 'అన్నట్లు, ఈ మధ్య, నా చూపు చాలా బాగయింది సుమా. అంత దూరాన దోమ కనిపిస్తే అది ఆడదో మగదో పోల్చగలుగుతున్నాననుకోండి,' అన్నాడు.

'చాల్లే నీ బడాయిలు! వారం క్రితమేగా నువ్వు పట్టపగలు కావడివాడిపైన పడింది?' అన్నాడు రెండోవాడు.

'పగలు మాట అటుంచు. చీకటిపడిన కొద్దీ అద్భుతంగా చూపు ఆనుతున్నది. కొందరికి రాత్రి చూపు ఉంటుందట,' అన్నాడు పెద్దవాడు.

'ఇవన్నీ ఎందుకొచ్చిన కబుర్లు? తింటే గాని రుచి తెలియదు. ఎవరి చూపు ఎటువంటిదో పరీక్ష పెడితే క్షణంలో తేలిపోతుంది,' అన్నాడు మూడోవాడు.

'ఏమిటా పరీక్ష?' అన్నాడు రెండోవాడు.

'చెబుతాను వినండి. మన వీధికెదురుగా సత్రం వాకిలి ఉన్నదే, ఆ వాకిలిపైన రేపు ఉదయం ధర్మశాసనం శిల వేయిస్తున్నారు. ఆ శిలపైన ఏమి చెక్కి ఉన్నదో చదవటమే మనకు పరీక్ష. దానిమీద అక్షరాలను మనలో ఎవరు ఎక్కువ దగ్గిరగా

టి.ఎస్.రామారావు



నిలబడి చదవగలిగితే వాడు ఓడినట్టు. మిగిలిన ఇద్దరికీ ఓడినవాడు భోజనం పెట్టేటట్టు పందెం!' అన్నాడు మూడోవాడు.

దీనికి పెద్దవాళ్లిద్దరూ సరేనన్నారు. చిన్నవాళ్లు తమ ఇళ్లకు వెళ్లిపోయాక పెద్దవాడికి బెంగపట్టుకున్నది. కారణం, ఆ శాసనాన్ని ముక్కుతో తాకిగాని చదవలేడు.

ఈ సమస్య గురించి చాలాసేపు సతమతమైన మీదట పెద్దవాడికి దివ్యమైన ఆలోచన తట్టింది.

సత్రంలో గుమాస్తా ఉంటాడు. ఆయననడిగితే ఆ ధర్మశాసనం పలక పైన ఏమున్నదీ చెప్పేస్తాడు. ఈ ఆలోచన తట్టగానే పెద్దవాడు ఉన్నఫళానా బయలుదేరి సత్రానికి వెళ్లాడు.

'ఏదో పనిమీద దయచేశారు?' అని అన్నాడు సత్రం గుమాస్తా.

'మరేమీ లేదు. రేపు ధర్మశిల వేస్తున్నారటగా? దానిమీద ఏమి రాయించారేమిటి?' అన్నాడు పెద్దవాడు.

'ఏమీ లేదండీ, శ్రీరామకటాక్షము అని రాయించారు,' అన్నాడు గుమాస్తా.

పెద్దవాడు ఆనందభరితుడై గుమాస్తా వద్ద సెలవు పుచ్చుకుని ఇంటికి బయలుదేరాడు. సత్రం వాకిలి వద్దనే రెండోవాడు పెద్దవాడికి ఎదురు వచ్చాడు. అయితే ఇద్దరూ చూపు ఆననివాళ్లే గనక ఒకరినొకరు గమనించలేదు.

పెద్దవాడికి వచ్చిన ఆలోచనే రెండోవాడికీ వచ్చింది. అతడు కూడా గుమాస్తా వద్దకు వెళ్ళి పెద్దవాడు అడిగినట్లే, ధర్మశాసనంపైన ఏమి రాయించారని అడిగాడు.

ప్రతివాళ్లూ ఇదే సంగతి అడగటం చూసి ఆశ్చర్యపడుతూ గుమాస్తా పెద్దవాడికి చెప్పినట్లే జవాబు చెప్పాడు.

రెండోవాడు అంతటితో తృప్తిపడి వెళ్లిపోక, 'పలక రంగు ఏది? అక్షరాలు ఏ రంగు?' అని అడిగాడు.

'తెల్లటి చలవరాతి పైన బంగారు చెక్కుడు అక్షరాలు,' అన్నాడు గుమాస్తా.

రెండోవాడు వెళ్లిన కాస్సేపటికి మూడోవాడు వచ్చి గుమాస్తాను మొదటి వాడు అడిగినట్లే అడిగాడు. గుమాస్తా చెప్పాడు.

'శ్రీరామ కటాక్షము అన్నదాని కింద



శాసనం వేయించేవారి పేరుగాని చెక్కించలేదా ఏం?' అన్నాడు మూడోవాడు.

'చిన్న అక్షరాలతో ఫలానావాడు అని చెక్కించారు. దానికి ఏం రంగు పూశారని అడుగుతారేమో! ఎర్ర రంగు' అన్నాడు గుమాస్తా నవ్వుతూ.

అన్నదమ్ములు ముగ్గురూ, నేను గెలిచా అనుకుంటే నేను గెలిచా అనుకుని ఆ రాత్రి నిద్రపోయారు. తెల్లవారగానే పెద్దవాడింటికి మిగిలిన వాళ్లిద్దరూ వచ్చారు.

ధర్మశాసనం చూడబోదామని ముగ్గురికీ ఆత్రంగానే ఉంది. అందుచేత అటే ఆలస్యం చేయకుండా ముగ్గురూ వీధిలోకి వచ్చారు.



పెద్దవాడు చప్పున ఆగి సత్రం కేసి చూసి, 'ఇంకా దగ్గిరికి పోవలసిన అవసరమేముంది? శాసనం పలకమీది అక్షరాలు ఇక్కడికే కనిపిస్తున్నాయి. చదవనా? శ్రీరామ కటాక్షము - కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి!' అన్నాడు.

ఈ మాటలు విని చిన్నవాళ్లిద్దరూ నిర్ఘాంతపోయారు. ఒక క్షణం పాటు తాము ఓడామని వాళ్లు భయపడ్డారు. కాని రెండోవాడు తెప్పరిల్లుకుని, 'పలక ఏ రంగుది? అక్షరాలు ఏ రంగు?' అని అడిగాడు.

పెద్దవాడికి గోతిలో పడ్డట్టయింది. 'రంగా! నీకు రంగు కనిపిస్తున్నదా?' అడిగాడతడు రెండోవాడిని.

'రంగు కనిపించకపోవటమేమిటి? తెల్లటి పలకమీది బంగారు పూత పూసిన చెక్కుడు అక్షరాలు అనిపించటం లేదూ?' అన్నాడు రెండోవాడు.

'మీరిద్దరూ ఎందుకు పోట్లాడుకుంటారు. ఆ ఫలకమీద చెక్కి ఉన్న చిన్న అక్షరాలు కబోది కూడా చదువుతుంది,' అన్నాడు మూడోవాడు.

'పలకమీద చిన్న అక్షరాలు కూడా ఉన్నాయా?' అన్నారు పెద్దవాళ్లిద్దరూ.

'కనిపిస్తూంటేనే! ఎర్రటి అక్షరాలు. ఫలానావారు అని స్పష్టంగా రాసి ఉంది! ఏమిటో అనుకున్నాను. మీ ఇద్దరి చూపు కంటే నాదే నయంలాగుందే!' అన్నాడు మూడోవాడు.

పెద్దవాడు తాను కూడా గెలిచిన వాడితో

చేరే ఉద్దేశంతో, 'నీ చూపే మన ముగ్గురి లోకీ మంచిది. తరవాత నా చూపు మంచి దంటాను. పెద్ద అక్షరాలను గుర్తించినది నేను కద! మీరింకా ముందుకుపోబో తుంటే నేను అక్కడే ఆగాను. అందుచేత నీకు నాకూ రెండోవాడు భోజనం పెట్టాలి,' అన్నాడు.

రెండోవాడు పేచీ పెట్టాడు. అక్షరాలు ఏ రంగో, పలక ఏ రంగో తెలుసుకోలేనివాడు చూశాడంటే ఎలా నమ్మటం?

కాస్సేపు ముగ్గురూ ఘర్షణపడి ఈ విష యంపై ఎవరి తీర్పు అయినా తీసుకోవ డానికి ఒప్పుకున్నారు. ఇంతలో సత్రం గుమాస్తా అటుగా వచ్చాడు.

'అయ్యా! మీరెవరో కాస్త మాకు న్యాయం చెప్పండి. ఆ సత్రం ధర్మశాసనం మీద శ్రీరామ కటాక్షము అని రాసి ఉన్న మాట అబద్ధమా?' అని పెద్దవాడు గుమ స్తాను అడిగాడు.

'కాదు!' అన్నాడు గుమాస్తా.

'పలకతెల్ల చలవరాయి అవునంటారా? దానిమీద బంగారు చెక్కుడు అక్షరాలే నంటారా?' అన్నాడు రెండోవాడు.

'అవును!' అన్నాడు గుమాస్తా.

'చిన్న అక్షరాలతో ఫలానావారు అని రాసి ఉన్నమాటా, అక్షరాలు ఎర్రగా ఉన్న మాట నిజమేనంటారా?' అన్నాడు మూడో వాడు.

'నిజమే!' అన్నాడు పూజారి.

మళ్లీ అన్నదములు ముగ్గురూ 'నా చూపు మెరుగు! అంటే నా చూపు మెరుగు' అని తగాదా పడసాగారు.

సత్రం గుమాస్తా వారిని ఆపి, 'మెరుగో తరుగో గాని మీ ముగ్గురి చూపూ ఒకటి గానే ఉన్నదని నా ఉద్దేశం. ఎందుచేతనంటే సత్రం వాకిలికి ఇంకా ధర్మశాసనం పలక తగిలించలేదు!' అంటూ నవ్వుకుంటూ తన దారిన తాను వెళ్లిపోయాడు.





# మట్టు - మర్యాద

పూర్వం ఒక ఊరిలో సుఖదాసు అనే పేద రైతుకు కుమారవర్ధనుడనే కుమారుడు ఉండేవాడు. చదువు పూర్తయ్యాక కుటుంబానికి చేదోడువాదోడుగా ఉండవలిసిందని సుఖదాసు తన కుమారుడితో చెప్పాడు. దీంతో కుమారవర్ధనుడు మంచి కొలువుకోసం ప్రయత్నాలు చేశాడు. అతడు హర్షగుప్తుడనే వ్యాపారి వద్దకు వెళ్లాడు. హర్షగుప్తుడు మరొక వ్యాపారి రత్నాచారికి కుమారవర్ధనుడి గురించి సిఫారసు ఉత్తరం రాసి ఇచ్చాడు. కుమారవర్ధ నుడు తర్వాత రత్నాచారిని కలిశాడు. సిఫారసు లేఖ ఉన్నప్పటికీ ప్రయాణం కారణంగా అతడి బట్టలు మురికిగా మారటం అతడు మాట్లాడే భాష కాస్త మొరటుగా ఉండటం రత్నాచారి గమనించాడు. అతడికి ఉద్యోగం ఇచ్చేదీ లేనిదీ తర్వాత చెబుతానని చెప్పాడు. తనకు ఇక ఉద్యోగం రాదని కుమారవర్ధనుడు అర్థం చేసుకున్నాడు.

తిరిగి హర్షగుప్తుడి వద్దకు వచ్చి జరిగినదంతా చెప్పాడు కుమారవర్ధనుడు. ఉద్యోగాన్ని ఆశించి వెళ్లేటప్పుడు చక్కటి, శుభ్రమైన దుస్తులను ధరించి వెళ్లాలని, మృదువుగా మాట్లా డాలని, భాషలో తప్పులు లేకుండా చూసుకోవాలని హర్షగుప్తుడు సలహా ఇచ్చాడు. మను షులు తమను తాము ఎలా ప్రదర్శించుకోవాలో అతడు కుమార వర్ధనుడికి సూచించాడు. మనిషి మాట్లాడే ప్రతి మాటనూ ప్రపంచం అంచనా వేస్తుంటుందని తెలిపాడు. ఈసారి అతడు సుమంగళుడు అనే మరొక వ్యాపారవేత్తకు సిఫారసు ఉత్తరం రాసి ఇచ్చాడు. కుమార వర్ధనుడు తనకు హర్షగుప్తుడు ఇచ్చిన సూచనలను తుచ తప్పకుండా పాటించాడు. సుమం గళుడి వద్ద కార్యదర్శి పదవి సంపాదించాడు కూడా. లోకంలో మర్యాద మన్ననలకు ఉన్న విలువ ఏమిటో అతడు అర్థం చేసుకుని హర్షగుప్తుడికి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

- మహావీర్ నానా





# శివయ్య కోరిక

రామాపురంలో శివయ్య, గంగమ్మ అనే దంపతులు ఆ ఊరి జమీందారు దగ్గర పనిచేసేవాళ్లు. ఓ రోజు సాయంత్రం పని ముగించుకుని ఇంటికి వస్తుండగా, శివయ్యకు పొరుగింటి నుంచి కమ్మని నేతి గారెల వాసన వచ్చింది. నోట్లో నీళ్లూరుతుండగా ఇంటికొచ్చాడు. స్నానం చేసి, భార్య వడ్డించిన రాగి సంకటిని చూసి, 'నాకు నేతిగారెలు తినాలని ఉంది.' అంటూ సంకటిని దూరంగా నెట్టాడు. 'మనమేమన్న శ్రీమంతులమా ఏమిటి? పూట గడవని మనకు నేతిగారెలు అత్యాశే,' అంటూ నొక్కింది గంగమ్మ. చిన్నబోయిన శివయ్య బలవంతంగా సంకటి తిన్నాడు.

ఆ సంవత్సరం జమీందారు, తన తండ్రి ఆబ్దికానికి ఏర్పాట్లు చేయసాగాడు. శివయ్య దగ్గరుండి అన్ని పనులు చూసుకుంటున్నాడు. అపరకర్మలు పూర్తి అయిపోయాక తద్దినపు భోక్తలకి భోజనం వడ్డించసాగాడు. అందులో నేతిగారెలు కూడా ఉండటం చూసి శివయ్యకి ప్రాణం లేచి వచ్చింది. తన భార్యని పెరట్లోకి పిలిచి, 'ఏమేవ్! శ్రాద్ధానికి నేతిగారెలు వడ్డిస్తున్నారు. సాయంత్రానికి కొన్నయినా మిగులుతాయి కదా. ఈ రోజుకి నేతిగారెలు తినే యోగం వచ్చిం'దని సంబరపడిపోయాడు.

బ్రాహ్మణుల భోజనం అయిపోయాక, కొన్ని పిండివంటలు, గారెలు మిగిలిపోయాయి. వాటిని ఏమి చేద్దామని అనుకుంటుండగా, 'అయ్యా, శ్రాద్ధ కర్మల కోసం వండిన వంటకాలు మిగిలి ఉంటే, దగ్గర్లోని చెరువులో వదిలేయండి. పితృదేవతలకు చేరుకుంటాయి,' అన్నాడు బ్రాహ్మణుడు.

ముద్దు గోపీకృష్ణ



మిగిలిన పిండివంటలు మూటగట్టి, జమీందారు శివయ్యకిచ్చి, 'ఒరే మన ఊరి చెరువులో వీటిని విడిచిరారా. మరిచేవు,' అన్నాడు. శివయ్య భారంగా చెరువుకేసి బయలు దేరాడు. కళ్లలో నీళ్ల తిరుగుతుండగా, వాటిని చెరువులో వదిలాడు.

ఇంటికొచ్చిన శివయ్య, 'చేతిదాకా వచ్చిన గారెలు నీళ్లపాలయ్యాయి. చెరువులో చేపైనా కాకపోతిని గారెలు తినడానికి' అని వాపోయాడు. 'మనకి తినే యోగం లేకుంటే ఎంత ప్రయత్నించినా దక్కవు,' అంటూ గంగమ్మ ఓదార్చింది.

శివయ్య ఎలాగైనా గారెలు తినాలని నిశ్చయించుకున్నాడు. ప్రతి నెలా కొద్ది కొద్దిగా డబ్బు పోగేయసాగాడు. పండుగ సమీపిస్తుండగా, బజారు నుంచి నెయ్యి, మినప్పప్పు, ఇతర దినుసులు తెద్దామని బయలు దేరాడు.

ఎదురుగా తన బావా, చెల్లెలు రావటం చూశాడు. 'ఈసారి పండగ ఇక్కడే జరుపుకోవడానికి వచ్చాం అన్నయ్యా' అంది చెల్లెలు. వారిని లోపలికి తీసుకెళ్లాడు. గంగమ్మ భర్తని పిలిచి, 'ఇంట్లో సరుకులు నిండుకున్నాయి. బజారు కెళ్లి పట్రా. గారెలు మరెప్పుడైనా చేసుకుందాం' అంది.

ఈ జన్మకి గారెలు తినే యోగం లేదనుకుంటా, అనుకుని బజారుకు బయలుదేరాడు శివయ్య. సరుకులు కొనుక్కుని ఇంటి దగ్గరకొస్తున్న శివయ్యకి కమ్మని నేతిగారెల వాసన రాసాగింది. ఆశ్చర్యంతో ఇంట్లోకి రాగా, గంగమ్మ సంతోషంతో, 'మీ చెల్లెలండీ. వస్తుంటే దారిలో ఆంజనేయ స్వామి గుడిలో పెట్టారట. మీకు ఇష్టమని పట్టుకొచ్చింది,' అంటూ ముందు పెట్టింది.

కళ్లలో నీళ్లు తిరుగుతుండగా, శివయ్య గారెలని కొరుకుతూ, తన చెల్లెలిని, బావనీ అనవసరంగా తిట్టుకున్నందుకు బాధపడ్డాడు. తన భర్త చిరకాల కోరిక తీరినందుకు గంగమ్మ మహదానందపడింది.



# రహస్యం

పెసరపాడు గ్రామాధికారి భూషయ్య ఏడేళ్ళ కూతురు కమల తండ్రి వద్దకు వచ్చి, 'నాన్నా, రహస్యం అంటే ఏమిటి?' అనడిగింది. 'ఎందుకూ?' అనడిగాడతను. కమల తన స్నేహితురాలు వనజ ఇంట్లో ఆడుకుంటూంటే, ఒకావిడ వచ్చి వనజ తల్లితో, ఏదో చెప్పబోయింది. అప్పుడు వనజ తల్లి పిల్లలతో, 'రహస్యాలు పిల్లలు వినకూడదు. బైటకు వెళ్ళి ఆడుకోండి,' అంది.

'సమాచారం, రహస్యం అంటే ఏమిటి నాన్నా?' అనడిగింది కమల. భూషయ్య 'వాటి అర్థం తరువాత చెబుతాను కాని, ముందు నువ్వు రచ్చబండ దగ్గరకు వెళ్ళి అక్కడ ఉన్న వారందరితోనూ సాయంత్రం నేను మామిడితోపు దగ్గరకు రమ్మన్నానని చెప్పిరా,' అన్నాడు. కమల వెంటనే పరుగెత్తుకు వెళ్ళి చెప్పి వచ్చింది.

కాసేపటి తరువాత భూషయ్య కొబ్బరితోటకు వెళ్తూ కూతుర్ని కూడా రమ్మన్నాడు. త్రోవలో ఓ ఇంటి వద్ద ఆగి, ఆ ఇంటి ఆసామీని పిలిచాడు. అతను బైటకు రాగానే, గొంతు తగ్గించి, 'వచ్చే నెలలో పెసర వెల పెరగబోతున్నట్టు సమాచారం అందింది. తొందరపడి నీ పంటంతా చవగ్గా అమ్మేయకు. ఈ సంగతి ఎవరికీ చెప్పకు' అన్నాడు భూషయ్య.

కొంతదూరం వెళ్ళాక మరో వ్యక్తి కనిపిస్తే అతన్ని పక్కకు పిలిచి, ముందు వ్యక్తికి చెప్పినట్టే చెప్పాడు భూషయ్య. త్రోవ పొడవునా మరో అరడజనుమందికి అలాగే చెప్పాడు.

అదంతా గమనిస్తూన్న కమల విస్తుపోతూ,' అదేంటి నాన్నా, ఎవరికీ చెప్పొద్దంటూ అందరికీ నువ్వే చెప్పేసావు?' అనడిగింది. భూషయ్య నవ్వి, 'రహస్యమంటే ఇదేనమ్మా. ఎవరికీ చెప్పొద్దంటూ ఒక్కొక్కరికే చాటుగా చెప్పేదే రహస్యం!' అన్నాడు. 'సమాచారమంటే బాహాటంగా పదిమందికీ తెలియపరచేది. నువ్వు రచ్చబండకు వార్తమోసుకుపోలా? అదన్నమాట.'

'రహస్యమంటే ఇదా!' అంటూ బుర్ర గోక్కుంది కమల. భూషయ్య నవ్వి, కొబ్బరి బొండాలు దింపించి తీయటి కొబ్బరినీటిని కమలకు ఇప్పించాడు. - తిరుమలశ్రీ





# పనికిరాని సాధనం

ఒక కుందేలు ఒక కొక్కిరాయి వద్దకు వచ్చి, 'నీవు కట్టుడు పళ్లు బాగా కడతావుట. నాకు రెండు మంచి దంతాలు కట్టు,' అన్నది.

'నీ పళ్లన్నీ బాగానే ఉన్నాయే,' అన్నది కొక్కిరాయి.

'బాగా లేవని కాదు. నాకు ఇంకా పొడుగైన కోరలు. సింహం కోరల్లాంటివి కావాలి', అన్నది కుందేలు.

'దేనికీ?' అని కొక్కిరాయి అడిగింది.

'నక్కను భయపెట్టడానికి, దానితో వేగలేకుండా ఉన్నాను. దాన్ని చూసినప్పుడల్లా పారిపోవలసి వస్తున్నది. ఈ దెబ్బతో అదే నన్ను చూసి పారిపోవాలి' అన్నది కుందేలు.

కొక్కిరాయి తనలోనే నవ్వుకుని కుందేలుకు రెండు భయంకరమైన కోరలు అమర్చింది. కుందేలు అద్దంలో చూసుకుని, 'అద్భుతం! ఇప్పుడు చెబుతాను నక్క పని!' అని నక్కను వెతుకుతూ బయలుదేరింది.

అది ఎంతో దూరం పోకుండానే ఒక పొద చాటున పొంచి చూస్తున్న నక్క కనిపించింది. కుందేలు అదురుకుని, శరవేగంతో కొక్కిరాయి వద్దకు తిరిగి వచ్చి, 'అన్నా, ఈ కోరలు తీసేసి, ఇంతకన్న భయంకరంగా ఉండేదేమైనా అమర్చగలవా?' అని అడిగింది.

'మార్చవలసినది నీ దంతాలు కావు నీ పిరికి గుండె! దాన్ని తీసేసి గట్టిగుండె అమర్చినప్పుడు గాని, నీ సమస్య తీరదు,' అన్నది కొక్కిరాయి.





# అమూల్యమైన ఆస్తి

పూర్వం విక్రమసేనుడనే రాజు అమరావతి నగరానికి రాజుగా ఉండేవాడు. ఆయనకు తన చుట్టూ ఉండే అధికారులపైన కొంచెం కూడా ఆదరం ఉండేది కాదు. ఎందుకంటే వారు ఎంతసేపూ, 'తమరు ఇంద్రులు, చంద్రులు! తమ పరిపాలనలో ప్రజలు స్వర్గసుఖాలు అనుభవిస్తున్నారు!' అని ఇచ్చకాలు పలుకుతూ ఉండేవారు. ఈ ధోరణి ఆయనకు నచ్చేది కాదు.

అందుచేత విక్రమసేనుడు అప్పుడప్పుడూ మారువేషం ధరించి మామూలు మనిషిలాగా పల్లెటూళ్లవెంట తిరుగుతూ, సామాన్య ప్రజలు ఎలా జీవిస్తున్నారో, వారి కష్టసుఖాలేమిటో స్వయంగా తెలుసుకుంటూ ఉండేవాడు. ఆయనకు తాను తినే రాజభోజనం కంటే గుడిసెలలో వాళ్లు తినే సామాన్యపు భోజనమే రుచికరంగా ఉన్నట్లు కూడా తోచేది.

ఒకనాడు విక్రమసేనుడు మారువేషంలో ఒక అడవి మధ్యగా వెళుతుండగా ఎవరో వేణువు ఊదటం వినిపించింది. రాజు ఆ పాట వినవచ్చిన దిక్కుగా వెళ్లి ఒక గొర్రెల కాపరిని చూశాడు.

వాడికి పదహారేళ్లు ఉంటాయి. చింకి బట్టలు ధరించినా మనిషి అందంగా ఉన్నాడు. వాడి అందచందాలు చూసి రాజు ఆశ్చర్యపడి, తనలాగే వాడు కూడా మారువేషంలో ఉన్న ఏ రాజకుమారుడో అనుకున్నాడు.

కాని ఆయన ఆ కుర్రవాడితో సంభాషించి వాడి తల్లితండ్రులు చాలా పేదవారని తెలుసుకున్నాడు.

ఎస్. సుందరరావు





ఆ గొర్రెలకాపరి పేరు సాంబుడు. వాడు రాజుగారి ప్రశ్నలకు సూటిగా సమాధానాలిచ్చాడు. వాడికి కపటంగా మాట్లాడటం ఏమాత్రం చేతకాదు. వాడి మాటలలో అమాయకత్వమూ, మంచితనమూ ఉట్టిపడుతున్నాయి.

'సాంబా, నా వెంట వస్తావా? నీకు మంచిబట్టలిచ్చి, భోజనం పెట్టి ఉద్యోగం ఇస్తాను!' అన్నాడు రాజు.

సాంబుడు సరేనన్నాడు.

అమరావతీ నగరం చేరి రాజభవనంలో అడుగుపెట్టాక, తనను తెచ్చినది సాక్షాత్తూ తమ దేశపు రాజుగారేనని సాంబుడికి తెలియవచ్చింది. రాజుగారికి తనపై అంత అనుగ్రహం కలిగినందుకు వాడు సంతోషించాడు.

సాంబుడి గొర్రెల కాపరి దుస్తులు తీసివేసి రాజోచితమైన దుస్తులూ, రత్నాలు పొదిగిన తలపాగా ఇచ్చారు. వాడికి రాయటమూ, చదవటమూ, సభలో మసులుకోవడమూ నేర్పారు.

కొద్దికాలం గడిచాక రాజుగారు సాంబుడిని తన ఖజానాదారుగా వేసుకున్నాడు. అనేక కోట్ల విలువ చేసే ఆ ఖజానాకు అధికారిగా ఉండటానికి సాంబుడి కన్న నమ్మకస్థుడు తనకు దొరకడని రాజుగారు భావించాడు.

ఈ ఉద్యోగంలో చేరకముందు రాజుగారి అనుమతితో సాంబుడు తన గ్రామానికి వెళ్లి తాను తిరిగిన చోట్లన్నీ మళ్లీ తిరిగాడు. వేణువు ఊదాడు. తరవాత తనవారందరికీ వాడు కానుకలు ఇచ్చాడు.

'రాజుగారి కొలువు ఎలా ఉంది?' అని తనవారు అడిగితే, 'మీరు ఈ గ్రామాన్ని వదిలి ఎక్కడికీ వెళ్లకండి! రాజదివాణాలలో అసలే ఉద్యోగాలు చేయకండి! నిజమైన సుఖం ఇక్కడే ఉన్నది!' అని సలహా ఇచ్చాడు.

తరవాత వాడు అమరావతికి తిరిగి వెళ్లి రాజుగారి ఖజానాదారుగా పని ప్రారంభించాడు.

కొంతకాలానికి రాజుగారు చనిపోయాడు. రాజుగారి కొడుకు కనకసేనుడు సింహాసనం ఎక్కాడు. రాజుగారి అధికా



రులలో చాలామందికి సాంబుడంటే పడేది కాదు. ఎందుకంటే చనిపోయిన రాజుగారు వాణ్ణి తమ అందరికన్న ఎక్కువ ఆదరంతో చూసేవాడు.

ఇప్పుడు ఈ అధికారులందరూ కొత్త రాజు చుట్టూ చేరి, 'మహారాజా, మీనాన్నగారి అండచేరి ఈ సాంబుడు మీ ఖజానాను కొల్లగొట్టేశాడు. వాణ్ణి ఒక కంట కనిపెట్టటం మంచిది!' అన్నారు.

తన అధికారులు తనక్షేమం కోరి ఏదైనా చెబితే రాజైనవాడు వినకుండా ఎలా ఉండగలడు? 'సాంబుడి ద్రోహం బయటపడే ఉపాయం చెప్పండి. అతడిని తప్పక శిక్షిస్తాను,' అన్నాడు కనకసేనుడు.

'మీ తాతగారి వద్ద రత్నాలు తాపిన పిడిగల కత్తి ఉండేది. దాన్ని తెచ్చి తమకు చూపమనండి,' అని కుట్రదారులు రాజుకు సలహా ఇచ్చారు.

రాజు సాంబుడిని పిలిపించి, 'మా తాతగారి కత్తి నీ ఆధీనంలో ఉన్నదట. దాన్ని ఒకసారి తెచ్చి నాకు చూపించు!' అన్నాడు.

'మహారాజా, ఆ కత్తిపిడినుంచి రత్నాలు తీయించి తమ తండ్రిగారు ఆభరణాలు చేయించారు,' అన్నాడు సాంబుడు.

సాంబుడు చెప్పిన మాట నిజమేనని రుజువయింది. ఎందుకంటే సాక్షులు చాలా మంది దొరికారు.

'సాంబుడు నిర్దోషిగా కనిపిస్తున్నాడు!' అన్నాడు రాజుగారు కుట్రదార్లతో.

'మహాప్రభూ, ఖజానాలో ఉన్న వస్తువులన్నిటి జాబితా వేసి తీసుకురమ్మనండి. పాత జాబితాలతో పోల్చి ఏ వస్తువులున్నాయో, ఏవేవి పోయాయో తెలుసుకోవచ్చు!' అన్నారు కుట్రదారులు.

రాజు గారి ఆజ్ఞ ప్రకారం సాంబుడు తన ఆధీనంలో ఉన్న అన్ని వస్తువులు జాబితా వేసి తెచ్చాడు. జాబితా చూస్తే వస్తువు లేవీ పోయినట్లు కనబడలేదు. వాడు వేసిన జాబితాలోని వస్తువులను తనిఖీ చేయడానికి రాజుగారు సపరివారంగా ఖజానాకు వెళ్లారు.

ఖజానా చూస్తుంటే రాజుగారికి పరమానందమయింది. అందులో వస్తువులన్నీ ఎంతో అందంగా, నేర్పుగా అమర్చు



న్నాయి. జాబితాను బట్టి వాటిని సరిచూడడం చాలా సులువుగా జరిగిపోయింది.

రాజుగారు వెళ్లిపోవడానికి ముందుగా సాంబుడిని ప్రశంసించబోతుండగా ఆయనవెంట ఉన్న అధికారులలో ఒకడు ఖజానా గోడలోని చిన్న ఇనుప తలుపు చూసి, 'గోడలో ఏదో సొరుగు ఉన్నట్లున్నది. అందులో ఏమున్నదో?' అన్నాడు.

రాజుగారు సాంబుడికేసి తిరిగి, 'ఆ సొరుగులో ఏమి వస్తువులు ఉన్నాయి? వాటిని ఈ జాబితాలో ఎందుకు చేర్చలేదు?' అని అడిగాడు.

'మహారాజా, మన్నించండి! ఆ సొరుగులో ఉన్నది నా సొంత ఆస్తి! అది నాకు అమూల్యమైనది! అందుచేత దానిని మీ జాబితాలో చేర్చలేదు!' అన్నాడు సాంబుడు.

ఈ మాటలు వినగానే, కుట్రదారులు సాంబుడిని గురించి చెప్పిన చాడీలన్నీ రుజువయినట్లే రాజుగారికి అనిపించింది. ఆయన కోపంతో, 'ముందు ఆ సొరుగు తలుపు తెరు!' అన్నాడు.

సాంబుడు ఇనుప తలుపు తెరిచాడు. దాని వెనకగోడలో ఉన్న సొరుగులో ఒక గొర్రెల కాపరి కంబళీ, పాతచెప్పులూ, ఒక వేణువు మాత్రమే కనిపించాయి.

రాజుగారు నిర్ఘాంతపోయి, 'ఇదేనా నీ అమూల్యమైన ఆస్తి?' అని అడిగాడు.

'అవును మహారాజా! నేను మీ తండ్రిగారి కొలువులో చేరకముందు నాకున్న ఆస్తి అదే. కొలువులో చేరాక నా మనసు సుఖమన్నది ఎరగదు. నేను సుఖపడింది, ఆ ఆస్తి ఉన్నంతవరకే!' అన్నాడు సాంబుడు.

రాజుగారు సాంబుడి మాటలతో మంచి గుణపాఠం నేర్చుకున్నాడు. తరవాత ఆయన సాంబుడిని తన తండ్రికన్న కూడా ఎక్కువగా ఆదరించి, వాడిమీద చాడీలు చెప్పినవారినందరినీ కొలువులో నుంచి తొలగింపచేశాడు.





# రెండు రహస్యాలు

జగద్గురువు ఆదిశంకరాచార్యుల వారు దేశమంతటా పాదయాత్రలు చేస్తూ భగవంతుని సారాంశాన్ని వ్యాపింపచేస్తున్న రోజులవి. అలా ఓ రోజు అటవీ ప్రాంతం గుండా కాశీనగరానికి తన భక్త బృందంతో యాత్ర సాగిస్తూ ఉండగా, చీకటిపడే సమయం కావొచ్చింది.

దూరంగా మినుకు మినుకుమంటూ దీపపు కాంతులతో ఓ ఊరు కానరావడంతో ఆ పూటకు అక్కడికి చేరి కాస్త విశ్రమించి మరునాడు పయనం సాగించవచ్చని శంకరాచార్యుల వారు శిష్యులకు ఆనతీయడంతో వారంతా ఊరి వైపు పయనం సాగించారు.

ఊరు సమీపించగానే ఆది శంకరాచార్యులవారు విచ్చేస్తున్నారని తెలిసిన జనులు తండోపతండాలుగా చేరి భజనలతో, దీపాలతో, పుష్పాలతో ఎదురేగి వచ్చి వారందరినీ ఊరిలో ఆశ్రమానికి కొనిపోయారు. కావలసిన పాలు పండ్లు భోజభక్ష్యాదులు అమర్చి ఆ రాత్రి వారిని సేవించారు.

మర్నాడు ఊరిలోని ప్రతి గడపను దర్శించారు. ఇంటింటా గోమాత దర్శనమిచ్చింది. ప్రతి ఇంటి వాకిటా తులసి వనాలు దర్శనమిచ్చాయి. పూజా మందిరాలలో వేదాలు వల్లింపబడుతున్నాయి. ఆ ఊరిని చూసేసరికి సమస్త దేవతలూ అక్కడే కొలువుతీరి ఉన్నట్లుగా అనిపించింది.

జనులందరినీ దీవిస్తూ జగద్గురువు తన శిష్యులతో తిరిగి పయనమై అందరివద్దా వీడ్కోలు తీసుకున్నారు.

ఊరికి కాస్త దూరంగా నడిచివచ్చాక శంకరాచార్యుల వారు కాస్సేపు ఆగి ఆ ఊరి వైపు చూశారు. శిష్యగణం అంతా చూస్తుండగా ఊరిని దీవిస్తూ, 'ఈ ఊరిలో ప్రతి గడపా నలుదిశలా చెదిరిపోవు గాక,' అని ఆశీర్వదించి నడక ప్రారంభించారు. స్వామి నోటి వెంట వచ్చిన ఆ వాక్కు విని శిష్యగణం ఆశ్చర్యపోయింది. జగద్గురువు ఎదుట నోరు మెదిపే ధైర్యం చాలక ఆలోచనలో పడ్డారు.

మరలా దట్టమైన కీకారణ్యం గుండా కాశీనగరం వైపు నడక సాగిస్తుండగా కొద్దిసేపటికి సాయం సమయం అయింది. దూరంగా మళ్లీ కొన్ని దీపపు కాంతులతో మరో ఊరు గోచరించింది. శంకరాచార్యులవారు ఈసారి ఆ ఊరి వైపు నడవమని ఆదేశించగా అంతా అటు పయనించి ఊరు చేరారు.

ఓ రాగి వృక్షం కింద పెద్ద అరుగు కనిపించేసరికి అక్కడ జగద్గురువు తన శిష్యులతో కలిసి ఆసీనులయ్యారు. కాని అక్కడి జనులలో సాత్వికత మచ్చుకైనా కానరావడం లేదు.

ఆదిశంకరాచార్యుల వారే అక్కడ వచ్చి నిలిచినా ఎవరికీ పట్టనట్లుగా చూసిపోతున్నారు. కొందరు జనులైతే మద్యం మత్తులో మునిగి జోగుతూ వీరిని చూసి పరిహాసం చేసి పోతున్నారు. అక్కడ సేవించడానికి మంచినీరు కూడా దొరకలేదు.

సుఖాలతో, మత్తుతో తులతూగుతున్న ఆ ఊరిని చూసి శిష్యగణం కోపంతో ఊగిపోతున్నా వారిని శాంతింపజేస్తూ జగద్గురువు ఆ రాత్రి అక్కడే గడిపి మరునాడు పయనం సాగించారు.



ఊరికి కాస్త దూరంగా వచ్చి శంకరాచార్యుల వారు ఊరి వైపు చూస్తూ ఆగారు. శిష్యులంతా ఊరిని శపించమన్నట్లు కళ్లెర్రజేసి చూస్తున్నారు. కాని స్వామి వారు ఆ ఊరిని దీవిస్తూ, 'ఈ ఊరు కలకాలం ఇచ్చోటనే ఐకమత్యంతో కలిసి ఉండుగాక,' అని దీవించి ముందుగు సాగారు.

శిష్యగణం మరింత ఆశ్చర్యానికి లోనయ్యారు. ఆతిథ్యం దొరికిన చోటుని చెదిరిపొమ్మన్నారు. అవమానం జరిగిన చోట అందరినీ కలిసి ఉండమని దీవించారు. స్వామి ఆంతర్యం ఏమై ఉంటుంది? శిష్యులను తొలిచి వేస్తున్న సందేహాన్ని గమనించిన జగద్గురువు వారితో 'మీరంతా నా దీవెనలలో అంతరార్థం తెలియక సతమతమవుతున్నారు కదూ,' అని అడిగారు.

లక్ష్మీనారాయణ

అప్పుడు అందరూ ముక్తకంఠంతో 'అవును స్వామీ, దయచేసి వాటి అంతరార్థం తెలియజేసి మా సందేహాన్ని నివృత్తి చేయగలరు', అంటూ ప్రాధేయపడ్డారు.

శంకరాచార్యులవారు ఆ అడవిలో ఓ చల్లని వృక్షం కింద అందరినీ కూర్చుండబెట్టి తానూ ఆశీనులై వివరిస్తూ, 'నాయనలారా, మనకు ఆతిథ్యం లభించిన మొదటి ఊరు అణువణువు భక్తి పారవశ్యంతో నిండి ప్రతి మనిషీ పావనుడై ఉన్నాడు. వారంతా వేదాలు, పురాణాలు అవపోసన పట్టిన మహాజ్ఞానులు. ఇటువంటి ఊరును చెదిరిపోవుగాక అంటే నా మనోభీష్టం అది కాదు. వారంతా నలువైపులా వ్యాప్తి చెందితే వారు ఏ మూల చేరినా అక్కడ భక్తి, సంస్కృతి విరాజిల్లుతుందని అర్థం. వారు పాదాలు మోపిన ప్రతిచోట ఎంతో ఆదర్శవంతమైన సమాజం వేళ్లూనుకుంటుంది. అలా వారు ఇక్కడే ఉండిపోతే సామాన్యులు జ్ఞానులయ్యేదెలా.. అందుకే వారిని నలుదిశలా విస్తరించేలా ఆశీర్వదించాను. మనకు అవమానం జరిగిన రెండవ ఊరుని కలిసి ఉండమని ఎందుకు దీవించానంటే ఈ ఊరిలో ప్రతి వ్యక్తీ తమోగుణంతో పెరిగి ఉన్నారు. మద్యపాన సేవనంతో మానవీయతను మరిచిపోయి నడుచుకుంటున్నారు. ఆ జనం ఏ చోటుకు చేరినా ఆ ప్రభావం మిగతా సమాజంపై పడి భ్రష్టుపడుతుంది. అందుకే వారిని అక్కడే కలిసి ఉండమంటూ.. పునరపి మరణం పునరపి జననంతో చివరికి ఆ జీవనవైవిధ్యమే ఓ నరకప్రాయమని తెలుసుకునేలా దీవించాను. ఈ రహస్యం సామాన్యులకి అంతుపట్టనిది. అర్థమయిందా.. నాయనా..., ఇక పదండి' అంటూ జగద్గురువు ముందుకు సాగారు.

తమ సందేహాలను నివృత్తి గావించుకున్న శిష్యులందరి మొహాల్లో వెలుగునిండుకుంది. తన సంకల్పబలంతో ఈ నేలను పునీతం చేసిన ఆదిశంకరులు భగవంతుడు కాక ఇంకెవరు, అనుకుంటూ భక్తిపారవశ్యంతో కాశీక్షేత్రం వైపు పాదయాత్ర కొనసాగించారు.





# మేలైన మెచ్చుకోలు

హేలాపురి మహారాజు హేమచంద్రుడు తన ఆస్థానంలోని ప్రసిద్ధ కవులు శివనాథుడు, సురకీర్తిలకు ఒకసారి తాను రాసిన 'సుజనరంజితం' అనే కావ్యాన్ని చదివి వినిపించి అభిప్రాయం చెప్పమన్నాడు. శివనాథుడు రాజుతో 'ప్రభూ కాళిదాసు జీవించి ఉంటే మీ రచనని చూసి ఈర్ష్యతో రగిలిపోయేవాడు. ఆ కృష్ణదేవరాయలవారినే తలపించారు' అన్నాడు.

సురకీర్తి 'మహారాజా! మీ కావ్యం శబ్దాలంకారాల సమతుల్యం పాటిస్తూ, వ్యాకరణ దోషాలు దొర్లకుండా సాగింది,' అన్నాడు. రాజు కవులిద్దరికీ ధన్యవాదాలు చెబుతూ, మంత్రిని పిలిచి 'వీరిద్దరినీ సముచితంగా సత్కరించండి,' అన్నాడు. మంత్రి తమలపాకులూ, వక్కలూ, వందకాసులూ ఉన్న వెండిపళ్లెం తెప్పించి 'మహారాజా, ఇది సురకీర్తి కవికి ఇవ్వండి,' అన్నాడు. రాజు ఆ బహుమతిని సురకీర్తికి అందజేశాడు. ఆ తరవాత మంత్రి కేవలం తమలపాకులూ, వక్కలూ మాత్రమే ఉన్న ఇత్తడి పళ్లెం తెచ్చి రాజుకిచ్చి, 'ఇది శివనాథకవికి ఇవ్వండి,' అన్నాడు.

రాజు ఆశ్చర్యపడి, 'మనం శివనాథుడిని సరిగా సత్కరిస్తున్నామా' అని మంత్రిని ప్రశ్నించాడు. మంత్రి ఏదో చెబుతుంటే శివనాథుడు వారించి, 'ప్రభూ! నేను మీ కావ్యం గురించి చెప్పినది అతిశయోక్తులతో కూడిన పొగడ్త. సురకీర్తి మాత్రం సాటికవిగా మీరు రాసింది మెచ్చుకోవడం మాత్రమే చేశాడు. అది మేలైన మెచ్చుకోలు. మెచ్చుకోవడానికీ, ఉబ్బేసి ఉక్కిరిబిక్కిరి చేయడానికి తేడా ఉన్నదని నాకు తెలియజెప్పటమే మంత్రి గారి ఉద్దేశం. అది నేను గ్రహించాను,' అన్నాడు.

రాజు మంత్రితో, 'శివనాథుడికి కూడా సురకీర్తి కిచ్చినట్లే సత్కారం జరిపించండి. ఆయన్ని సత్కరిస్తున్నది నన్ను ఉబ్బేసి పొగడ్తలతో ముంచెత్తినందుకు మాత్రం కాదు. ఇది ఆయన సౌజన్యతకు నేను చేస్తున్న సన్మానం' అన్నాడు.

– జొన్నలగడ్డ రత్న





# పరిశుద్ధుడు

'మామయ్యా ఈ ఉత్తరం చూడండి!' అంటూ శేఖర్ ఒక కవర్‌ని రాంచంద్‌కి ఇచ్చాడు. 'భారతీయ ఉన్నత పాఠశాలలో సైన్స్ ఉపాధ్యాయుడి ఉద్యోగం కోసం ఇంటర్వ్యూకి రమ్మని కబురు చేశారు. మీరు కనుక నాకు సహాయం చేసినట్లయితే ఈ ఉద్యోగం తప్పక చేజిక్కించుకుంటాను. పాఠశాల నిర్వాహకుడితో, ప్రధానోపాధ్యాయుడితో మీకు పరిచయం ఉంది కదా. నా గురించి ఒక మంచి మాట వారితో చెప్పండి చాలు.'

'శేఖర్! మంచిమాట చెప్పినంత మాత్రాన నీకు ఒరిగేది ఏమీ ఉండదు. ఆ మాటతో పాటు చాలా పెద్దదాన్నే వారిముందు పెట్టాలి. మరి నీవద్ద అది ఉందా?' అన్నాడు మామయ్య.

'అర్థం అయింది మామయ్యా, ఎంత మొత్తం కావాలన్నా చెల్లించడానికి సిద్ధంగా ఉన్నాను,' అన్నాడు శేఖర్. 'నువు చురుగ్గానే ఉన్నావు శేఖర్,' నవ్వాడు మామయ్య.

ఆ మరుసటి దినమే, రాంచంద్ పాఠశాల నిర్వాహకుడిని, ప్రధానోపాధ్యాయుడిని కలసి శేఖర్ గురించి చెప్పాడు. తర్వాత శేఖర్‌తో తెరవెనుక తాను చేయగలిగిన పని పూర్తి చేశానని, ఉద్యోగం రావడం ఇక నిమిషాలమీద పనేనని తెలిపాడు. శేఖర్ ఆనందంతో ఉబ్బితబ్బిబ్బయ్యాడు.

ఇంటర్వ్యూ రోజు రానే వచ్చింది. హాజరైన అభ్యర్థులందరితో శేఖర్ పిచ్చాపాటీగా మాట్లాడుతూ, వారంతా పలుకుబడి గలవారి మద్దతుతో వచ్చారని, ఉద్యోగం కోసం పాఠశాల యాజమాన్యం చేతులు తడపడానికి కూడా వాళ్ళు సిద్ధంగా ఉన్నారని తెలుసుకున్నాడు.

డి. జానకి



ఒక ఉద్యోగం కోసం ఇంతపోటీ ఉంటుందని ఊహించని శేఖర్ వెంటనే మామయ్య రాంచంద్‌ను సెల్ ద్వారా సంప్రదించి తాను ఉద్యోగం కోసం లక్షరూపాయల వరకు కూడా ఇవ్వగలనని ఈ విషయాన్ని ఎంపికదార్లకు తెలిపి తనకు అనుకూలంగా ఒప్పందం కుదుర్చుకోవలసిందని కోరాడు.

రాంచంద్ కూడా ఎంపిక కమిటీకి ఈ విషయం తెలియజేశాడు. అయితే ఎంపిక కమిటీ పెద్దవారి నుండి ఏ సిఫార్సు తెచ్చినట్లు కనబడని అరవింద్ అనే మామూలు వ్యక్తిని ఆ ఉద్యోగానికి ఎంపిక చేసింది.

శేఖర్ కుప్పగూలిపోయాడు. ఏం మనుషులో? వాళ్లకు లక్షరూపాయల వరకు ఇస్తానని చెప్పినా పట్టించుకోలేదు. వెంటనే రాంచంద్‌ను సంప్రదించాడు. రాంచంద్ కూడా ఆగ్రహించాడు. వాళ్లిద్దరూ ప్రధానోపాధ్యాయుడితో వాదులాటకు దిగారు.

ప్రధానోపాధ్యాయుడు స్పష్టంగా చెప్పేశాడు. 'రాంచంద్ గారూ! ఇది పాఠశాలేగాని సంత కాదు. సంతలో మీకు నచ్చిన ధర పెట్టి సరుకులు కొనగలరు. అపవిత్రమైన పని చేయటానికి మీరు ఒక పవిత్రమైన చోటకు వచ్చారు. ఉపాధ్యాయుడి కొలువుకు వెల కట్టి మరీ కొనడానికి మా వద్దకు వచ్చారు. క్షమించాలి. మేం దాన్ని అమ్మలేము. ఇక్కడ ఉపాధ్యాయులు పిల్లలకు జ్ఞాన బోధ చేయడానికి ఉన్నారు. చిన్న పిల్లల్లో నిజాయితీ అనే విత్తనాలను చల్లడం కోసమే వారు ఇక్కడ ఉన్నారు. లంచమివ్వడానికి సిద్ధపడి పాఠశాల పవిత్రతకే భంగం కలిగించదలిచినవాడు కాకుండా నిజాయితీ కలిగిన వాడే ఈ పనిని చక్కగా నెరవేర్చగలడు. శేఖర్‌తో సహా పలువురు అభ్యర్థులను పరిశీలించిన తర్వాత అరవింద్ ప్రతిభావంతుడే కాక, స్వచ్ఛమైన వ్యక్తిగా కూడా గుర్తించాము. అందుకే ఈ ఉద్యోగానికి అతడినే ఎంపిక చేశాము.'

రాంచంద్ నోట మాట పడిపోయింది. అతడు తల దించుకుని ప్రధానోపాధ్యాయుడి గది నుంచి అవమానంతో బయటకి వచ్చాడు.



# పనివాడు

రాఘవాపురంలో ఇరవై ఎకరాల ఆసామి రామచంద్రుడు. రామచంద్రుడిది సువిశాలమైన ప్రాంగణం మధ్యలో ఓ మోస్తరు ఇల్లు. ఇంటి చుట్టూ ఉన్న ఖాళీ ప్రదేశంలో రకరకాల పూలమొక్కలు, పండ్ల చెట్లు పచ్చదనంతో కళకళలాడేవి. రామచంద్రుడి దగ్గర తోటమాలిగా ఉన్న వీరయ్య కాలం చేయడంతో కొత్త పనివాడు అవసరమయ్యాడు. ఇది తెలిసి ఒకరోజు ఉదయానే సీతయ్య, కాశయ్య అనే యువకులు ఆయన దగ్గరకొచ్చారు.

ఇద్దరి వివరాలనడిగిన రామచంద్రుడు, తాను ఒక ముఖ్యమైన పనిపై పట్నం వెళుతున్నానని, మరుసటి రోజు ఉదయం కనిపించమని చెప్పి తన గుర్రబ్బగ్గీమీద వెళ్లిపోయాడు. సూర్యుడు నడినెత్తికొచ్చేసరికి ఆయన ఇంటికి చేరాడు. ప్రధానద్వారం దగ్గర సీతయ్య మట్టిని సరిచేస్తూ దారికడ్డంగా అక్కడక్కడా ఉన్న చిన్న చిన్న రాళ్లను ఏరి పారవేస్తూ కన్పించాడు. రామచంద్రయ్య బగ్గీని నిలిపి, 'పైన ఎండ మండిపోతోంది. రేపు ఉదయాన్నే కనిపించమన్నానుగా. ఇక్కడేం చేస్తున్నావు!' అని అడిగాడు.

సీతయ్య వినయంగా లేచి నిలబడి 'అయ్యా! ఉదయం తమరు బగ్గీలో పోతున్నప్పుడు గుర్రం కాలు జారి ఇక్కడున్న చిన్న గుంతలో పడి బగ్గీ మొత్తం అదిరింది. ప్రమాదాలు చెప్పిరావు. అందుకే దానిని సరిచేస్తున్నానయ్యా!' అన్నాడు భయపడుతూ.

రామచంద్రయ్య "కాశయ్య నా మాటకు విలువనిచ్చి వెళ్లిపోయాడు. అదీ మంచి పనే. అయితే సీతయ్య నా క్షేమం కాంక్షించాడు. ఉపాధి కోసం చేసే పనిని ప్రేమించడంతో పాటు అన్నం పెట్టే యజమాని మేలు కోరేవాడే అసలు సిసలయిన పనిమంతుడు. ఇటువంటివారే చేసే పనిపట్ల నిబద్ధత, కలిగి ఉంటారు" అని ఆలోచించి సీతయ్యను తోటమాలిగా తీసుకున్నాడు.

– జి. ప్రియరాణి







# శిథిలాలయం - 27

(వృశ్చికలంకకు పోయేదారిలో ఒకచోట, జాంగ్‌లా శిఖిముఖీ వాళ్లకు తటస్థపడతాడు. తనను శిథిలాలయపూజారి చంపజూశాడని అతడు శిఖిముఖికి చెప్పాడు. సూర్యోదయంతో అందరూ తిరిగి ప్రయాణమయారు. ఒక లంక మలుపులో, పూజారి పడవలు వాళ్లకు కనిపించినై, విక్రమకేసరి పూజారి కేసి బాణాలు వదలసాగాడు. తరవాత)

విక్రమకేసరి వదిలిన బాణాలు శిథిలాలయ పూజారిక్కాదు గదా, అతడున్న పడవక్కూడా తగలలేదు. జలజంతువు కదలిక వల్ల లేచే నీటి అలలమీద పూజారి పడవలు అటూ ఇటూ ఒరుగుతూ చాలా వేగంగా కొట్టుకుపోతున్నవి. జలజంతువు తానంతకు ముందు పట్టుకుతిన్న వాడితో కాస్త తృప్తిపడినట్లుగా పడవలను లోగడంత వేగంగా తరమటం లేదు. ఒకటి రెండు నిమిషాలు గడిచినై. జలజంతువు నీటిలో ఉన్న చోటునే ఆగి మెడ అటూ ఇటూ తిప్పి ఓసారి చుట్టూ కలయజూసింది.

ఆ భయంకర జంతువు దృష్టి తమ మీద పడుతుందేమో అన్న భయంతో శిఖిముఖీ అతడి అనుచరులూ, దాపులనున్న రెల్లు పొదలచాటుకు తప్పుకున్నారు. ఎర్రగండు మొరగకుండా శిఖిముఖి దాని తల నిమరసాగాడు.

అతడికి జలజంతువు తమను పట్టుకుని కబళిస్తుందన్న భయం కన్న, ఒడ్డున ఉన్న తమ పడవల్ని నీట ముంచుతుందేమో అన్న భయం అధికంగా ఉన్నది. అలా జరిగితే, తాము ఈ నిర్జనమైన లంక మీద చిక్కుకుపోతారు...

దాసరి సుబ్రహ్మణ్యం



చూస్తుండగానే శిథిలాలయ పూజారి ఉన్న పడవలు లంక మలుపు తిరిగి, కన బడకుండా పోయినై.

జలజంతువు తృప్తిగా ఒళ్ళు విరుచు కుంటున్నట్టు నీటిలో అటూ ఇటూ కాసేపు పొర్లి లేచి, తల మాత్రం నీటి బయటకు పెట్టి, దూరంగా ఉన్న మరో చిన్న లంకకేసి బయలు దేరింది. అది కనబడకుండా పోయేవరకూ ఆగి, శిఖిముఖీ వాళ్లు దాగిన చోటునుంచి బయటకు వచ్చి, తిరిగి తమ పడవల మీదికి వెళ్లారు.

తమ ప్రయాణం జంతువు వెళ్లిన దిక్కు కాకపోవడం వాళ్లకు కొంత ధైర్యాన్నిచ్చింది. కాని, ఈ జలమయప్రదేశంలో అటువంటి భయంకర ప్రాణులు మరికొన్ని ఉండవ చ్చన్న అనుమానం వాళ్లను బాధించసా గింది. వీటన్నిటికీ తోడు శిథిలాలయ పూజారి తమ ప్రయాణాన్ని ముందుగానే పసిగట్టడం అన్నిటినీ మించిన సంకటాన్ని తెచ్చిపెట్టవచ్చు.

పడవలు రెండూ కదలబోయే సమ యంలో, శిఖిముఖి అందరికీ వినబడేంత పెద్దగొంతుతో, 'వృశ్చికలంకకు వెళ్లాలనే ప్రయత్నంలో ఉన్న సాధకబాధకాలు, ఈసరికి అందరికి తెలిసి వచ్చినై అనుకుం టాను. నేనూ, కేసరీ ఏ పరిస్థితుల్లోనూ అక్కడికి వెళ్లక తప్పదు. కాని, మిగతా వాళ్లెవరైనా ఇక్కడ దిగబడిపోదలిస్తే నా కభ్యంతరం లేదు. తిరుగు ప్రయాణంలో అలాంటివాళ్లను తీసుకుపోతాం. ఈలోపల వాళ్ళకు అవసరం అయిన ఆహార పదా ర్థాలు ఈ లంకలో వదులుతాం', అన్నాడు.

ఈ మాటలకు ఒక్క క్షణం అందరూ ఆశ్చర్యపోయారు. నాంగ్‌సోమ్, అజిత వీరభద్రులతోపాటు, కుంటి జాంగ్‌లా కూడా ఎన్ని కష్టాలు ఎదుర్కోవలసి వచ్చినా, వృశ్చిక లంకకు వెళ్ళి తీరవలసిందే అన్నాడు. 'శిథిలాలయ పూజారి అంతం చూడవలసి ఉన్నదనీ, కనక తాను ఒంటరిగానైనా సరే, వృశ్చిక లంకకు వెళ్లక తప్పద'నీ అన్నాడు, జాంగ్‌లా.

తమ అనుచరుల ధైర్యాన్నీ, పట్టుద లనూ, విశ్వాసాన్నీ శిఖిముఖీ , విక్రమకేస రులు మెచ్చుకున్నారు.

పడవలు కదిలినై. గాలి అనుకూలంగా ఉండటంతో తెరచాపలు ఎత్తారు. తమకన్న



ముందు లంక మలుపు తిరిగిపోయిన పూజారి వాళ్ల పడవల కోసం అందరూ జాగ్రత్తగా చుట్టుపక్కల ప్రదేశాన్ని పరీక్షిం చసాగారు. కాని, సూర్యాస్తమయ సమ యమవుతున్నా వాళ్లకు పూజారి పడవలు ఎక్కడా తారసపడలేదు. చీకటి పడుతుం డగా పడవలను ఒక చిన్న లంక ప్రదేశాన ఒడ్డు చేర్చి, తాళ్లతో వాటిని ఒడ్డునున్న చెట్లకు కట్టి, ఆ దాపులనే అందరూ వంట ప్రయత్నాలు ప్రారంభించారు.

వంట పూర్తయి అందరూ భోజనాలు చేసేసరికి జాముపొద్దు గడిచిపోయింది. ఈ లంకలో తీరంలో మొసళ్లున్న సూచ నలు లేవు. కాని, లంకమీది చెట్టుచేమల్లో మాత్రం అనేక రకాల నీటిపక్షులు ఉన్నవి. అవి పొద్దు పోతున్న కొందికీ మరింత బిగ్గరగా గీబా అంటూ గోల చేయసాగినై.

నెగడు వెలిగించి శిఖిముఖీ అతడి అను చరులూ దాని చుట్టూ చేరి మాట్లాడుకోసా గారు. వాళ్లకల్లంత దూరంలో పడవలు రెండూ అలల తాకిడికి లేచి పడుతూ, ఆ చీకట్లో నాట్యం చేస్తున్న రెండు పెద్ద భూతాల్లా కనిపిస్తున్నవి. కొంచెం సేపు మాట్లాడుకున్న తరవాత ఒకరొకరుగా శిఖి ముఖీ వాళ్లు నెగడు చుట్టూ ముడుచుకు పడుకున్నారు. రెండవ జామున కాపలా పని నాంగ్‌సోమ్‌ది.

నాంగ్‌సోమ్ ఈటె పట్టుకుని ఒకసారి పడవల దగ్గరకు పోయి చూసి, తిరిగి నెగడు దగ్గరకు వచ్చి కూచున్నాడు. నీటి



పక్షులు చేసే గోల అతడికి తల దిమ్మెత్తి స్తున్నది. అతడొకసారి బద్ధకంగా ఆవి లించి, పక్కనే నిలబడి ఉన్న ఎర్రగండు తలను నిమరబోయాడు.

ఎర్రగండు మెడ పక్కకు తిప్పి, పడవ లున్న దిక్కుకేసి ఓ అడుగు వేసి, గాలిలో తలను అటూ ఇటూ ఓమారు తిప్పి చిన్నగా మొరిగింది. పసికట్టడంలో ఎర్ర గండు కున్న శక్తి బాగా తెలిసినవాడు కావటంతో నాంగ్‌సోమ్, అది తల తిప్పిన దిక్కుకేసి పరీక్షగా చూశాడు. పడవల్లో ఒకటి ఓ క్షణకాలం పక్కకు ఒరిగి, రెండవ దాన్నుంచి కొంచెం దూరం కదిలినట్టు అత డికి తోచింది.

నాంగ్‌సోమ్ ఎర్రగండు మొరగకుండా దాని తల నిమిరి, ఈటెను గట్టిగా గుప్పెట

బిగించి, నేలమీద వంగి నడుస్తూ పడవల దగ్గరకు వెళ్లాడు. అతడింతకు ముందు చూసినట్లు ఒక పడవ రెండవదానికి భిన్నంగా నీటి మీద ఉండి ఉండి చప్పున ఒక పక్కకు ఒరిగి, మళ్లీ యథాప్రకారం నిలబడుతున్నది.

పడవ కింద ఏవో మొసళ్లు చేరి పొట్లాడుకుంటున్నవేమో అన్న అనుమానం నాంగ్‌సోమ్‌కు కలిగింది. కాని, పరీక్షగా చూడగా అక్కడ నీటిలో పెద్ద కదలిక ఏమీ అతడికి కనిపించలేదు.

దానితో అతడికి శత్రువెవరో పడవ కింద దాగి ఉండి పడవకు చిల్లి పొడవడమో, లేక దొంగిలించుకుపోవాలనే ప్రయత్నమో చేస్తున్నాడన్న అనుమానం గట్టిగా కలిగింది.

నాంగ్‌సోమ్ ఎర్రగండును నీటి ఒడ్డునే ఉంచి, నిశ్శబ్దంగా నీటిలో దిగి పడవను చేరి, దానిమీద ఎక్కి నిలబడ్డాడు. ఆ సమయంలో పడవ కొంచెంగా అటూ ఇటూ ఒరిగింది. వెంటనే దాని అడుగు నుంచి ఒక నల్లని ఆకారం చప్పున నీటిమీదికి తేలింది. గుడ్డివెన్నెల్లో ఒకరినొకరు గుర్తించారు.

కన్ను మూసి తెరిచేంతలో నాంగ్‌సోమ్ చేతిలోని ఈటెను బలంగా ఆ నల్లని ఆకారం కేసి విసిరాడు. అదే సమయంలో నీటిలో ఉన్నవాడు చప్పున ఈటెను నాంగ్‌సోమ్ మీదికి ప్రయోగించాడు. ఆ ఈటె పడవ అంచును తాకటం, నాంగ్‌సోమ్



ఈటె దూసుకొచ్చి వాడి వెన్నులో దిగబడటం ఒకేసారి జరిగిపోయింది.

నీటిలో ఉన్నవాడు ఒక్కచావు కేక పెట్టాడు. వెంటనే నాంగ్‌సోమ్ నీటిలోకి దూకి వాణ్ణి చేతులతో బలంగా పట్టుకుని ఒడ్డుకేసి ఈడ్చుతూ, పెద్ద గొంతుతో, 'శత్రువులు! శత్రువులు!' అని కేకలు పెట్టసాగాడు.

ఆ కేకలు వింటూనే శిఖిముఖీ వాళ్లు అదురుకుంటూ నిద్రలు లేచి నాంగ్‌సోమ్ ఉన్న చోటుకు పరిగెత్తుకొచ్చారు. ఆ సరికి నాంగ్‌సోమ్ గాయపడినవాడిని బాగా ఒడ్డు మీదికి ఈడ్చుకు వచ్చాడు. వాడి వెన్నులో దిగిన ఈటె అలాగే దిగబడి ఉన్నది. వాడు బాధతో ఆయాస పడుతున్నాడు. అజితుడి చేతిలో ఉన్న కాగడా తీసుకుని, దాని



కాంతిలో శిఖిముఖి వాడి ముఖం పరీక్షించి చూశాడు. వాడు మరెవరో కాదు. తిమ్మగూడెం ప్రాంతాల గల అడవుల్లో దొంగల్లా బతికే ముఠాలోని వాడు. ఆ ముఠావాళ్లు ఇద్దరు ముగ్గురు శిథిలాలయ పూజారి బంట్లుగా గోల్‌భరా వచ్చారన్నమాట.

నాంగ్‌సోమ్, శిఖిముఖికి జరిగిందంతా ఒకటి రెండు మాటల్లో టూకీగా చెప్పేశాడు. శిఖిముఖి దొంగతో, 'నువ్వు చేసిన దురంతాలకు తగిన చావే నీకెదురైంది. నీ వెన్నులో దిగబడి ఉన్న ఈటెను లాగేయించుతాను. కాని వెంటనే చస్తావు. చచ్చేముందు ఒక్కమాట చెప్పు. మా పడవలకు అడుగున చిల్లులు పొడిచి ముంచాలనే గదా నువ్వొచ్చింది? పూజారి ఏ లంకలో దిగాడు?' అని ప్రశ్నించాడు.

దొంగ ఓసారి మూలిగి మొదటి ప్రశ్నకు అవునన్నట్టు తల ఊపి, అక్కడికి దాపులనే ఉన్న మరొక లంకకేసి బాధగా చేయి ఎత్తి చూపాడు.

ఆ వెంటనే శిఖిముఖి, నాంగ్‌సోమ్‌ను ఈటె లాగివేయమన్నాడు. నాంగ్‌సోమ్ ఈటెను వెన్నులో నుంచి బయటకు గుంజగానే, దొంగ గిలగిలా ఓ క్షణకాలం పాటు తన్నుకుని కొయ్యదుంగలా నిగడదన్నుకుపోయాడు.

'శిఖీ! ఆ పూజారి వెధవ లోగడ మనను అరణ్యంలోన వెన్నంటి గోల్‌భరా వచ్చినట్లే, ఇప్పుడు వృశ్చికలంకక్కూడా మన వెనకనే వస్తున్నాడు!' అన్నాడు విక్రమకేసరి.

'వాడు వూరికే రావటం లేదు. దారిలోనే మనను నాశనం చేయాలని చూస్తున్నాడు. మన పడవల్ని నీటముంచితే, మనం ఈ దిక్కుమాలిన లంక మీద ఆకలికి అలమటించి చస్తామని వాడి ఆశ. ఏమైనా, ఇక ముందు మనం పడవల విషయంలో మరింత గట్టికాపలా ఏర్పాటు చేసుకోవడం క్షేమం,' అన్నాడు శిఖిముఖి.

నాంగ్‌సోమ్ ఆ చీకట్లోనే శిథిలాలయ పూజారి దిగిన లంకకు పోయి, వాడిని హతమార్చడం బావుంటుందని సలహా ఇచ్చాడు. కాని, అది కేవలం దుస్సాహసం అవుతుందనీ, ఏ చెట్టుచాటునో ఉండి, వాడూ, వాడి అనుచరులూ తమ మీద దొంగదెబ్బ తీయగలరని, శిఖిముఖి చెప్పి, ఆ ఆలోచనను వ్యతిరేకించాడు.



ఆ రాత్రి మరే అవాంతరం లేకుండా తెల్లవారిపోయింది.

శిఖిముఖీ అతడి అనుచరులూ పడవలను సిద్ధం చేసి, ముందుగా దొంగ చెప్పిన లంకను సమీపించి, జాగ్రత్తగా దానిమీద దిగారు.

వాళ్లు ఎంతో వెతకగా వెతకగా ఒకచోట రాత్రి పూజారి ముఠా వాళ్లు వేసుకున్న నెగటి గుర్తులు మాత్రం కనిపించినై. వాళ్లు ఏ తెల్లవారు జామునో లంక వదిలిపోయారు.

తరవాత నాలుగు రోజులపాటు వాళ్లు చిన్నా పెద్ద లంకల పక్కగా ప్రయాణం చేసి అయిదవనాటి సంధ్యాసమయానికి ఎత్తయిన కొండలతో, మహావృక్షాలతో ఉన్న ఒక పెద్ద లంకను చూశారు. ఈ మధ్య కాలంలో వాళ్లకు శిథిలాలయ పూజారి ఉన్న పడవలు ఎక్కడా కనబడలేదు.

తాను తన జాతి ఇభ్యుపెద్దల ద్వారా విన్న వృశ్చికలంక ఇదేనని నాంగ్‌సోమ్ గుర్తించాడు. అతడు ఇదే వృశ్చికలంక అని శిఖిముఖీ, విక్రమకేసరులతో చెప్పగానే వాళ్లు ఎక్కడలేని సంతోషంతో పడవలను తీరానికి నడపమన్నారు.

కొద్దిసేపటి తరవాత పడవలు రెండూ తీరాన్ని చేరినై. అందరూ పడవల్లోంచి ఒడ్డుకు దిగారు. ఇంకా వెలుతురు ఉండగానే, దాపుల ఉన్న కొండ ఎక్కి లంక ఎలా ఉన్నదీ చూసేందుకు విక్రమకేసరీ, శిఖిముఖీ బయలుదేరారు. మిగతావాళ్లు పడవల దగ్గిరే ఉండిపోయారు.

వాళ్లిద్దరూ కొండ పైభాగం చేరి దూరంగా లంకలో అంతకన్న చాలా ఎత్తుగా ఉన్న మరికొన్ని కొండల కేసి కొంచెం సేపు చూసి, వెనుదిరగబోయేంతలో వాళ్ల దృష్టి దిగువనున్న చిన్న గుట్ట మీద పడింది. ఆ వెంటనే వాళ్లక్కలిగిన ఆశ్చర్యం అంతా ఇంతా కాదు. ఆ గుట్టమీద పాడుబడి కూలిపోవటానికి సిద్ధంగా ఉన్న ఒక దేవాలయం ఉన్నది.

(ఇంకా ఉంది)





# సరైన తీర్పు

నీరవుడు తన పెరటిలో నాటిన కొబ్బరి మొక్క ఏపుగా ఎదిగి కొంతకాలానికి బాగా కాపుకి వచ్చింది. అతను మొక్కను నాటిన సమయంలో అక్కడ ఏ ఇల్లు లేదు. తరవాత గిరిధరుడు అతడి ఇంటి పక్కనే తన ఇల్లు కట్టుకున్నాడు.

అయితే నీరవుడి ఇంట్లో పెరిగిన కొబ్బరి చెట్టు గిరిధరుడింటి వైపుకు వాలింది. కాసిన కాయలన్నీ అటువైపే రాలిపోతుండేవి. వాటిని గిరిధరుడు వెనక్కు ఇవ్వకుండా తన స్వంతానికి వాడుకునేవాడు. నీరవుడు చెట్టెక్కి దింపుకోబోతే చెట్టు తన ఇంటివైపు వంగి ఉన్నందున అవి తనకే దక్కుతాయని మొండిగా వాదించాడు. జరిగింది అన్యాయంగా భావించిన నీరవుడు తిన్నగా వెళ్లి గ్రామాధికారి పెంచలయ్యకు మొరపెట్టుకున్నాడు. అది విన్న వెంటనే గ్రామాధికారి, గిరిధరుడికి కబురు పెట్టి పిలిపించాడు.

'చెట్టును నేనేం వాలమనలేదే! నా వైపుకు వచ్చిన వాటిని అనుభవించే హక్కు నాకు ఉండదా!' అన్నాడు గిరిధరుడు అడ్డంగా వాదిస్తూ.

అతనికి ఎంత చెప్పినా వినకుండా తిరుగుముఖం పట్టాడు. గ్రామపెద్ద పెంచలయ్య సమయం వచ్చినప్పుడు సరైన తీర్పునిస్తానన్నాడు.

అలా కొంత కాలం గడిచింది. ఈ మధ్య కాలంలో కొబ్బరి బాగా విరగకాసినా సరే నీరవుడికి ఏమాత్రం దక్కలేదు.

ఒక ఏడాది పోయాక ఓరోజు గిరిధరుడింట్లో వారందరికీ దురదలు పట్టుకున్నాయి. కారణం తెలీక తంటాలు పడుతూంటే కొబ్బరి చెట్టుపైకి ప్రాకిన దూలగొండి తీగ నూగు పడటం వల్ల దురదలు వచ్చినట్లుగా పనివాడు చెప్పాడు.

వెంటనే గిరిధరుడు ఆగ్రహంతో, 'నీ ఇంట్లో పుట్టిన దూలగొండిని వెంటనే పెకిలించి పారెయ్యి. అది నా ఇంటి మీదికి ఎగబ్రాకింది. దీనివల్ల నానా నరకంగా ఉంది' అన్నాడు.

దాన్ని పెరికి పారెయ్యాల్సిన అవసరం తనకు లేదని, పక్కింట్లోకి పాకితే తనేం చేయగలనని మొండిగా చెప్పేశాడు నీరవుడు. గిరిధరుడు ఆవేశంలో దురదగొండి తీగను పీకబోయేసరికి ఆ కాయలన్నీ పేలిపోయి, ఇల్లంతా జల్లుకుపోయి మరింతగా దురదలు తగులుకున్నాయి.

తనకు జరిగిన మోసాన్ని గ్రామపెద్దకు చెప్పుకుందామని వెళ్లాడు గిరిధరుడు.

'నీ ఇంట్లోకి వాలినవాటిని అనుభవించే హక్కుందని నీవే అన్నావుగా! నీ ఇంట్లోకి వచ్చిన కొబ్బరి కాయలు నీ సొత్తయినప్పుడు దానిమీదకు ఎగబ్రాకిన దురదగొండి మాత్రం నీదెందుక్కాకూడదో చెప్పు? మంచి చెడు రెండూ సమానంగా అనుభవించాల్సిందే కదా!' అన్నాడు పెంచలయ్య.

అంతే, గిరిధరుడి నోటమాట రాలేదు. చివరికి చేసేది లేక దారికి వస్తూ కొబ్బరి కాయల విలువను నీరవుడికి తిరిగిస్తానని, దురదగొండిని సమూలంగా పెకిలించమని చెప్పి వేడుకున్నాడు.

అయితే గిరిధరుడికి బుద్ధి చెప్పడానికి, పెంచలయ్యే నీరవుడికి ఈరకంగా సలహా ఇచ్చి గిరిధరుడిని దారికి తెచ్చిన సంగతి మాత్రం ఎవరికీ తెలీదు.

కె.కె. రఘునందన





# చెవిటిమేళం

రాత్రి భోజనాల అనంతరం తాతయ్య ఆరుబయట వెన్నెలలో పడకకుర్చీలో కూచున్నాడు. తాతయ్య చిటికెడు పొడుం తీసి పీల్చి, చెయ్యి దులుపుకుంటూ ఈ శ్లోకం చదివాడు:

''పరోక్తం సా ధ్వనాకర్ణ్య
న యుక్తం ప్రతిభాషితుమ్
బహిర్నిష్కాసిత: కోపి
బధిర: ప్రతికూలవాక్.''

తాతయ్య చుట్టూ కూచున్న పిల్లలు 'ఆ శ్లోకానికి అర్థమేమిటి తాతయ్యా,' అని అడిగారు.

'శ్లోకానికి అర్థమా? వినండి చెబుతాను. దాని అర్థమేమిటంటే: ఇతరులు చెప్పేది సరిగా వినకుండా బదులు పలకరాదూ అని! ఒకానొక చెవిటివాడు అసందర్భంగా మాట్లాడినందువల్లనే గదా వాణ్ణి తన్ని తగిలేశారు!' అన్నాడు తాతయ్య.

'ఆ చెవిటివాడు ఎవరు తాతయ్యా? వాడేమన్నాడు తాతయ్యా? వాణ్ణి ఎందుకు తన్ని తగిలేశారు తాతయ్యా?' అంటూ పిల్లలు ప్రశ్నల వర్షం కురిపించారు.

'ఎందుకర్రా అన్ని ప్రశ్నలూ? ఆ కథ చెబుతాను వినండి,' అంటూ తాతయ్య ఈ కథ చెప్పాడు:

వెనకటికి కాంచీపురంలో దేవశర్మా, హరిశర్మా అని ఇద్దరు స్నేహితులుండేవారు. చిన్నతనంలో ఇద్దరూ కలిసి తిరిగారు. పెద్దవారైనాక కూడా వాళ్లమధ్య స్నేహం ఉండిపోయింది.

ఇలా ఉండగా, దేవశర్మ ఉన్నాడే.. వాడికి కొంచెం చెవుడు ఆరంభమయింది. అది అందరికీ తెలిసిపోతుందేమో అని వాడు భయపడుతూ ఉండేవాడు.

సి. శేషాద్రి

ఒకసారి హరిశర్మకు జబ్బు చేసింది. ఎన్ని వైద్యాలు చేసినా అది తిరుగుముఖం కాలేదు. తన వ్యాధి నిమ్మళించదని హరిశర్మ నిరాశ పడ్డాడు కూడా.

తన మిత్రుడైన హరిశర్మకు జబ్బుగా ఉందని దేవశర్మకు తెలియవచ్చింది.

అతణ్ణి చూసి పరామర్శించి వద్దామని బయలు దేరాడు.

తనకు మరి చెవుడు గద. చాలా సేపు మాట్లాడుతూ కూచుని ప్రయోజనం లేదు. అవతలి వాళ్లు చెప్పేవి తనకు ఎలాగు వినపడవు. తనకు చెవుడని అందరికీ తెలిసిపోతుంది. అందుకని ముచ్చటగా మూడే ప్రశ్నలు వేసి, స్నేహితుణ్ణి పరామర్శించి వచ్చేద్దామనుకున్నాడు.

తనను చూడటానికి దేవశర్మ వచ్చాడనగానే హరిశర్మ సంతోషించి కూచోమని చెయ్యి ఊపాడు.

'జబ్బు ఎలా ఉంది?' అని అడిగాడు దేవశర్మ.

'ఇది నయమయ్యేట్టు లేదు,' అన్నాడు హరిశర్మ.

ఆ మాట దేవశర్మకు వినపడదుగా! 'భగవంతుడి దయవల్ల అలాగే జరగాలి.. ఔషధం ఏమిటి?' అని మళ్లీ అడిగాడు దేవశర్మ.

'మృత్యువే ఇక నాకు ఔషధం,' అన్నాడు హరిశర్మ.

'అదే మంచి మందు.. ఇంతకూ వైద్యుడెవడు?' అని దేవశర్మ మళ్ళీ ప్రశ్నించాడు.

'ఎవడా? యమధర్మరాజు!' అన్నాడు హరిశర్మ వళ్లు మండి.

'అతణ్ణే నమ్ముకో! చాలా గట్టివాడు!' అన్నాడు దేవశర్మ.

ఇదంతా వింటున్న హరిశర్మ బంధువులు దేవశర్మ ధోరణికి మండిపడి, అతడిని పట్టుకు చావగొట్టి, వీధిలోకి గెంటారు.

'చూశారా, అవతలివాడి మాటలు వినకుండానే జవాబివ్వడం అనేది ఎంత అనర్థాన్ని కలిగిస్తుందో!' అన్నాడు తాతయ్య.



# బిచ్చగాడి నిధి

ఒక పేద రైతు ఒకనాడు పొలంలో పని చేసి అలిసిపోయి, ఇంటికి వచ్చి, నడుము వాల్చి, 'ఓ దేవుడా! నాకొక చిన్న నిధి ఇవ్వలేవా?' అని ప్రార్థన చేశాడు.

అకస్మాత్తుగా అతని ముందొక సంచీ పడింది. మరుక్షణమే అతనికి ఇలా వినబడింది: 'ఈ సంచీలో నీకు బంగారు నాణెం దొరుకుతుంది. దాన్ని తీస్తే ఇంకొకటి దొరుకుతుంది. తడవకు ఒకటి చొప్పున దాని నుంచి నీకు ఎన్ని నాణేలైనా దొరుకుతాయి. నీకు చాలినన్ని తీసుకున్నాక, ఈ సంచీని నదిలో పారెయ్యి, అయితే ఒక్కటి గుర్తుంచుకో, సంచీని నదిలో పారేసేదాకా నువ్వా డబ్బును ఖర్చు చేయరాదు. అలా ఖర్చు చేశావో, నువు తీసిన డబ్బు యావత్తూ మాయమవుతుంది.'

రైతు పరమానందం చెంది, ఆ రాత్రల్లా సంచీలో నుంచి బంగారు నాణాలు తీసి, ఒక గోతం నింపాడు. మర్నాడు అతనికి ఇంట్లో తిండి లేదు. సంచీని నదిలో పారేసిన దాకా బంగారాన్ని వాడటానికి లేదు. ఇంకొక్క రాత్రి అంతా కూర్చుని ఇంకొక గోతం నింపి, తరువాత సంచీని నదిలో పారేద్దామనుకున్నాడు. ఇలా చాలా రోజులు గడిచాయి. గోతాలు బంగారు నాణాలతో నిండుతున్నాయి. రైతు రోజూ బిచ్చమెత్తి పొట్ట నింపుకుంటున్నాడు.

చివరకు ఒకనాడు అతను చనిపోయాడు. ఇరుగు పొరుగు వాళ్ల వచ్చి చూసి ఆ బిచ్చగాడి ఇంటి నిండా గోతాల కొద్దీ బంగారు నాణాలుండటం చూసి నిర్ఘాంతపోయారు.








# కన్నీటి విలువ

రామవరంలో రామయ్య ఓ మధ్యతరగతి రైతు. ఆయన ఆస్థల్లా నాలుగెకరాల మాగాణి. మూడెకరాల మెట్ట. అయితే పేద సాదలను, అవసరార్థులను ఆదుకోవడంలో ఆయనకు ఆయనే సాటి. దానం చేయడంలో బొత్తిగా ఎముకలేని చెయ్యి. భార్య విశాలాక్షి కూడా భర్తకు తగ్గదే.

అదే ఊళ్లో ఉండే చంద్రయ్య అనే సన్నకారు రైతు రామయ్యకు చిన్ననాటి స్నేహితుడు. ఇద్దరూ ఎంతో కలివిడిగా ఉంటారు. చంద్రయ్యకు మిత్రుడి అతి మంచితనం సుతరామూ నచ్చేది కాదు. ప్రతి రాత్రీ భోజనాలు ముగించుకుని రచ్చబండ దగ్గర కలుసుకున్నప్పుడు 'నీ అతి మంచితనం ముందుముందు ఎన్ని అనర్థాలకు దారి తీస్తుందోనని ఒక్కసారైనా ఆలోచించావా. నీ ఇద్దరు ఆడపిల్లల బాగోగులు దృష్టిలో పెట్టుకుని కాస్త వెనకా ముందు ఆలోచించడం అలవర్చుకో.' అని రామయ్యను హెచ్చరించేవాడు చంద్రయ్య. మౌనమే సమాధానంగా ఓ చిరునవ్వుతో సరిపెట్టేసేవాడు రామయ్య.

ఇదిలా ఉండగా ఒక రోజు ఉదయానే రామయ్య, చంద్రయ్యలు రచ్చబండ దగ్గర తారసపడ్డారు. వాళ్లిద్దరూ సంభాషించుకుంటుండగా ఓ యువకుడు అక్కడికి ఆందోళనగా వచ్చాడు. 'అయ్యా, నా పేరు శివయ్య. నాది పొరుగునే ఉన్న రావిపల్లి. నేను రాతి పనులు చేసుకుంటాను. రెండు రోజులనుండి మా అమ్మకు తెగ సుస్తీ చేసింది. మూసిన కన్ను తెరవడం లేదు. ఆచారిగారి దగ్గరకి తీసుకెళితే వైద్యానికి ఎనిమిది వందలు దాకా ఖర్చవుతుందని చెప్పారు. కాస్త దయ తలచండి. జీవి

జాన్ కెనడీ



తాంతం రుణపడి ఉంటాను,' అని వలవలా ఏడ్చేశాడు.

రామయ్య కొద్దిసేపు ఆలోచించి 'కుదువపెట్టడానికి ఏదన్నా వస్తువుందా?' అని అడిగాడు.

కళ్లు తుడుచుకున్న శివయ్య 'నా పెళ్లికి అత్త తరపు వారు పెట్టిన ఉంగరం ఉంది. తీసుకుని సాయం చేయండి,' అని వేలికున్న ఉంగరాన్ని తీసి రామయ్య చేతిలో పెట్టాడు.

రామయ్య దానిని ఎగాదిగా చూసి, 'ఇది అసలుదో నకిలీదో తెలియడం లేదు. నకిలీని అసలుగా చూపించి ఏమార్చడం ఈ రోజుల్లో పరిపాటయిపోయింది' అని జేబులో నుండి రెండు వందలు తీసి శివయ్య చేతిలో పెట్టాడు.

శివయ్య గుడ్ల నీరు కుక్కుకుని, 'అయ్యా, తమరు సందేహించనవసరం లేదు. అది నిఖార్సయిన బంగారమే. మీ మిత్రుడి సలహా కూడా తీసుకుని మరో ఐదారు వందలన్నా ఇప్పించండి. చావు బతుకుల్లో ఉన్న మా అమ్మను బతికించుకుంటాను,' అని దీనంగా వేడుకున్నాడు.

రామయ్య కన్నెర్రజేసి 'ఇష్టమైతే తీసుకో, లేకుంటే ఆ రెండొందలు కూడా ఇచ్చేసి నీ వస్తువుతో వెనుదిరుగు,' అని మండిపడ్డాడు. శివయ్య మారుమాట్లాడకుండా కళ్లు తుడుచుకుని చకచకా అడుగులేస్తూ వెళ్లిపోయాడు.

శివయ్య అటు వెళ్లగానే చంద్రయ్యతో రామయ్య 'నాతో రావిపల్లి వరకు రాగలవా?' అని అడిగాడు. ధర్మాత్ముడని అందరితో పొగడ్తలందుకునే రామయ్య ప్రవర్తనలో మరో కోణాన్ని చూసి లోపల బాధపడుతున్న చంద్రయ్య అయిష్టంగానే ఒప్పుకుని మిత్రుడితో బయలుదేరాడు.

ఇరువురూ రావిపల్లి చేరీచేరగానే సరాసరి ఆచారిగారి ఇంటిని సమీపించారు. కిటికీలో నుండి లోపలికి తొంగి చూసిన రామయ్యకు ఆచారిగారిని ఏడుస్తూ ప్రాధేయపడుతున్న శివయ్య కనిపించాడు.

'ఆచారిగారూ, సమయానికి మీరడిగిన మొత్తం సమకూరలేదు. ఈ రెండొందలు తీసుకుని వైద్యం ప్రారంభించండి. మిగతా మొత్తం సాయంత్రానికల్లా ఎలాగోలా సర్దుబాటు చేస్తాను,' అని ఆచారి కాళ్లావేళ్లా పడుతున్నాడు శివయ్య. ఆచారి ససేమిరా అంటున్నారు.

అదే సమయానికి రామయ్య లోపలికి ప్రవేశించి, 'ఆచారిగారూ, రోగులతో చెలగాటమాడటం తగదు. కాసులతో ముడిపెట్టి తిరిగి తీసుకురాలేని ప్రాణాన్ని తీయకండి. ఇదిగో, ఈ ఆరొందలు కూడా తీసుకుని శివయ్య తల్లికి వెంటనే వైద్యం ప్రారంభించండి,' అని మందలించి, ప్రక్కనే నిలబడ్డ శివయ్య, అతని భార్యకు ధైర్యవచనాలు చెప్పి, జేబులో నుండి ఉంగరం తీసి శివయ్య చేతిలో పెట్టి, 'దగ్గరుండి వైద్యం చేయించుకుని నీ తల్లిని బ్రతికించుకో, ఆ భగవంతుడు తప్పక సాయం చేస్తాడు,' అని సానుభూతి ప్రదర్శించి మరీ బయటికొచ్చాడు రామయ్య.

మిత్రుడి ప్రవర్తన చంద్రయ్యకు అయోమయంగా తోచింది. ఇంతవరకు రామయ్య వస్తువులు కుదువపెట్టుకున్న దాఖలాలు లేవు. 'సిసలైన బంగారం కుదువపెట్టినా నకిలీదేమో అని అనుమానించిన నువ్వు, ఎండలో ఇంతదూరం నడిచివచ్చి మరీ సాయపడటం లోని ఆంతర్యమేమిటి మిత్రమా!' అని అడిగేశాడు చంద్రయ్య కుతూహలం ఆపుకోలేక.

రామయ్య నవ్వి, 'అపాత్రదానం పనికి రాదు. నేను అసలా, నకిలీనా అని అనుమానించింది బంగారాన్ని కాదు. శివయ్య కన్నీటిని. ఈ రోజుల్లో చెడు వ్యసనాలకు బానిసలుగా మారిన వారు ఎన్నో మోసాలకు తెగబడటం ప్రతి రోజూ చూస్తున్నాం. నిజానిజాలు తెలుసుకోకుండా సహాయం చేస్తే ఆ సహాయం ఎన్నో అనర్థాలకు దారితీయగలదు.

సహాయం చేసేవాడెప్పుడూ అర్హులకే చేయాలి తప్ప అనర్హులకు కాదు. మనకు ఇప్పుడు ప్రత్యక్షంగా తెలిసిందిగా, శివయ్య కన్నీటి విలువ ఓ నిండు ప్రాణమని!' అని వివరించాడు. విచక్షణ దూరదృష్టితో కూడిన రామయ్య మంచితనాన్ని చంద్రయ్య మనస్ఫూర్తిగా అభినందించకుండా ఉండలేకపోయాడు.





# అట్టమీది బొమ్మ

జూన్ నెల చందమామలో మహారాక్షసుడు కుంభకర్ణుడి చిత్రాన్ని అట్టమీది బొమ్మగా ప్రచురించాము. కుంభకర్ణుడు రావణాసురుడి సోదరుడు. ఇతడు మహావీరుడని మనకు తెలుసు. యుద్ధరంగంలో అడుగుపెట్టి రావణుడి విజయం కోసం కడదాకా ప్రయత్నించిన వీరుడితడు. రాముడితో జరిగే యుద్ధంలో తను ఓటమిని ఎదుర్కొనబోతున్నట్లు ఇతడికి తెలుసు. యుద్ధంలో వరుస పరాజయాల తర్వాత రావణుడు తన సోదరుడైన కుంభకర్ణుడి సహాయం తీసుకోవాలని నిర్ణయించాడు. ఆ సమయంలో కుంభకర్ణుడు ఆరు నెలల దీర్ఘ నిద్రలో ఉంటాడు. కుంభకర్ణుడి నివాస గృహం ఒక పెద్ద గుహ. అతడిని లేపడానికి ధైర్యం చేసి వచ్చిన రాక్షస బలగం అతడి ముక్కుల్లోంచి వచ్చే గాలికే బయటకి కొట్టుకొచ్చారట. అతడిని లేపడానికి వాయించిన నగారాల మోత అతను పెట్టే గురకమోతలో వినిపించలేదట! నిద్రిస్తున్న కుంభకర్ణుడి భారీకాయాన్ని చూసి రాక్షసులు వణికిపోయారు. అతడి దేహం మీదికి ఎక్కి ఈటెలతో పొడిస్తే అతనికి నల్లి కుట్టినట్లు కూడా ఉండేది కాదు. ఏనుగులతో తొక్కించారు. అన్నీ నిష్ప్రయోజనమే అయినాయి. చివరకు అతడు లేచాడు. తీవ్రమైన ఆకలి. ఆకలి తీర్చాక అతడు, నన్నెందుకు ఇప్పుడు లేపారు, సోదరుడు రావణుడు కుశలమేనా అని అడిగాడు. రామాయణం మొత్తంలో కుంభకర్ణుడు విశ్వాసానికి మారుపేరుగా నిలుస్తాడు. తాను అధర్మపక్షంలో ఉన్నట్లు అతడికి తెలుసు కాని యుద్ధం చేయడం తప్పని, రావణుడు చేస్తున్నది తప్పని అతడు తన సోదరుడికి సూచించాడు. రావణుడు అతడిని అవమానించి అతడి శౌర్యంపై సందేహం వ్యక్తపరిచిన తర్వాతే కుంభకర్ణుడు యుద్ధంలో పాల్గొని తన విధి నిర్వర్తించాలని నిశ్చయించుకున్నాడు. విభీషణుడిలా ఇతడు రావణుడితో తన బంధాన్ని తెంచుకోలేదు. తప్పైనా, ఒప్పైనా హితులకోసం చివరికంటా ప్రయత్నించే తీరుకు కుంభర్ణుడు పెద్ద ఉదాహరణగా నిలుస్తాడు. అతడి నిర్ణయం తప్పు కావచ్చు లేదా ఒప్పు కావచ్చు కాని సోదరుడి పట్ల అతడు చూపించిన అభిమానం, విధి నిర్వహణలో స్వచ్ఛత వల్లే అతడికి మోక్షప్రాప్తి కలిగింది. చందమామ మేటి చిత్రకారులు శ్రీ ఎంటివి ఆచార్య చిత్రించిన ఈ చిత్రం 1948 మే చందమామలో ప్రచురించబడింది. జూలైలో మా వార్షిక ముఖచిత్రంతో మళ్లీ కలుసుకుందాము.

\- సౌమ్య భరద్వాజ్



# కెరీర్ అంటే?




ఈ నెల మనం ఇంటీరియర్ డిజైనింగ్ గురించి తెలుసుకుందాము. ఇది గత దశాబ్దంలో కొత్త మలుపు తీసుకుంది.

ఇంటీరియర్ డిజైనింగ్ తనకు తానుగా ఒక వృత్తిగా శరవేగంగా వృద్ధి చెందింది. పైగా ఇది బాగా వెలుగులోకి వచ్చింది కూడా. అసంఖ్యాక ప్రజలు డిజైనింగ్‌పై ఆసక్తి ప్రదర్శించి తమ అభిరుచి, శైలికి అనుగుణంగా కార్యాలయాలు, నివాసప్రాంతాలను రూపొందించుకుంటున్నారు, నిర్వహిస్తున్నారు.

డిజైనింగ్ అంటే కళాత్మక ప్రతిభ, సృజనాత్మకతల కలబోత. డిజైన్ అనేక విభిన్న రంగాలతో కూడి ఉంటుంది. ఇంటీరియర్ డిజైనింగ్ అంటే నివసిస్తున్న స్థలాన్ని అమర్చుకోవడం. అంటే ఇళ్లు, కార్యాలయాలు, రిటైల్ షాపులు, హోటళ్లు, విమానాశ్రయాలు వంటి వాటిని ఆర్గనైజ్ చేయడం, నిర్వహించడం, ప్లాన్ చేయడం. గొలుసు హోటళ్లు, రిసార్టులు, ఆసుపత్రులు, ప్రైవేట్ కన్సల్టెంట్లు, స్టూడియోలు రంగాల్లో ఇంటీరియర్ డిజైనర్లు ఉపాధి అవకాశాలను పొందవచ్చు.

వీరు తమ స్వంత వ్యాపారాలను కూడా నిర్వహించుకోవచ్చు. మార్కెట్‌లో ఒకసారి వీరికి పేరు వచ్చిందంటే వీరి వ్యాపారం మూడుపువ్వులు ఆరుకాయలుగా విలసిల్లుతుంది.

భారతదేశంలో ఇంటీరియర్ డిజైనింగ్‌లో కొన్ని సంస్థలు మాత్రమే చక్కటి ప్రోగ్రామ్‌లను అందిస్తున్నాయి. అహమ్మదాబాద్‌కు చెందిన స్కూల్ ఆఫ్ ఇంటీరియర్ డిజైనింగ్ నాలుగేళ్ల ప్రోగ్రామ్‌ను, ముంబైకి చెందిన జె.జె.స్కూల్ ఆఫ్ ఆర్ట్స్ ఫైనార్ట్స్ డిగ్రీలో నాలుగేళ్ల బ్యాచులర్ డిగ్రీని అందిస్తున్నాయి. అభ్యర్థులు ఇంటర్మీడియట్‌లో గణితం, జీవశాస్త్రం, భౌతిక శాస్త్రం, ఇంగ్లీషులో 55 శాతం మార్కులను సాధించి ఉండాలి. ఇక కనీస అర్హతతో ఒక సంవత్సరం డిప్లొమా కోర్సులు కూడా చాలానే అందుబాటులో ఉన్నాయి. పదవ తరగతి ప్రాతిపదికన అనేక ప్రైవేట్ సంస్థలు కూడా దీనికి సర్టిఫికెట్ కోర్సులను అందిస్తున్నాయి.

క్లయింట్‌లను సంతృప్తి పరచే సామర్థ్యంపైనే ఇంటీరియర్ డిజైనర్ల విజయం ఆధారపడి ఉంటుంది. వీళ్లు కళాత్మక, సాంకేతిక, ఇంటర్‌పర్సనల్ మరియు మేనేజ్‌మెంట్ కౌశలాలను తప్పక కలిగి ఉండాలి. ఇంటీరియర్ డిజైనర్లు సృజనాత్మకంగా, ఊహాత్మకంగా ఉండాలి. స్వయం ప్రేరణతో, క్లయింట్ మాటలను చక్కగా వినగలగాలి. అలాగే ఇంటీరియర్ డిజైనర్‌కి అద్భుతమైన భావవ్యక్తీకరణ సామర్థ్యం ఉండాలి. ఎందుకంటే తమ ఆలోచనలను, అవసరాలను వీరు క్లయింట్లకు, బిల్డర్లు, ఎలక్ట్రీషియన్లు వంటి ఇతర వృత్తి జీవులకు చక్కగా వివరించాల్సి ఉంటుంది.

\- సాయి

# చందమామ లోకజ్ఞానం క్విజ్ - 41

(పదహారేళ్ళ లోపు పిల్లలకు)

అన్నీ సరైన సమాధానాలు రాసిన ఒకరికి బహుమతి ₹250/-*

*సరైన సమాధానాలు రాసినవారు ఒకరికన్నా ఎక్కువమంది ఉన్నట్లయితే ఒక్కొక్క విజేతకు ₹50/- బహుమతిగా ఇవ్వబడుతుంది.

మీరు చేయువలసిందేమంటే :

1. సమాధానాలు రాయండి.
2. మీ పేరు, వయసు(16 ఏళ్ళ లోపు ఉండాలి) పిన్ కోడ్‌తో సహా పూర్తి చిరునామా రాయండి.
3. చందాదారు అయితే, ఆ నంబర్ రాయండి.
4. కవరు మీద చందమామ లోకజ్ఞానం క్విజ్ -41 అని రాసి, చందమామ పూర్తి చిరునామా రాసి మాకు పంపండి.
5. జూలై నెలాఖరులోగా మీ ఎంట్రీలు మాకు అందాలి.
6. సెప్టెంబర్ 2012 సంచికలో ఫలితాలు వెలువడుతాయి.

## మహాభారతంలో పాత్రలు



1. మహాభారత కావ్యంలో ప్రధాన పాత్ర ఎవరు?
2. మహావిష్ణువు ఎనిమిదవ మరియు సంపూర్ణావతారం అని చెప్పబడుతోంది ఎవరు?
3. అర్జునుడికి తన గాంధర్వ ఆయుధాన్ని ఇచ్చినది ఎవరు?
4. గాంధారి సోదరుడు ఎవరు?
5. కుంతీదేవి, పాండురాజుల పెద్ద కుమారుడు ఎవరు?
6. గురు సాందీపని కుమారుడిని కాపాడటానికి కృష్ణుడికోసం నావ నడిపినది ఎవరు?
7. కృపి ద్రోణాచార్యుల పుత్రుడు ఎవరు?

**చందమామ లోకజ్ఞానం క్విజ్-38 సమాధానాలు:**

1. ఎలీషా ఓటిస్; 2 లాజ్లో బిరో; 3. డెనిస్ పాపిన్; 4. టిమ్ బెర్నర్స్-లీ; 5. శామ్యూల్ కోల్ట్; 6. విల్లీస్ కారియర్; 7. కింగ్ గిల్లెట్.

*March'12 Winners*: 1. S. Janakiram Mannavar, Asarajan, Nanded, Maharastra-431603.
2. Sohag Singha, New Barrackpur(P.O), North 24 Parganas(Dt.), Kolkata-700131.
3. Krishnankith Banerjee, Paramanand Chok Gate, Delhi-110009.
4. V.P. Aishwarya, Periyamkode, Mannanthala, Thiruvananthapuram-695 015.
5. Kumare Kavyashree, IJARI Lakamapur(Village), Haveri, Karnataka-581110.





# నవ్వుల పువ్వులు



చరణ్ పక్షి ప్రేమికుడు. ఒకరోజు తన ఇంటి పెరడులో నిల్చుని ఉండగా ఒక గుడ్లగూబ అరవడం విన్నాడు. దాని అరుపుకు ప్రతిస్పందించి దానిలాగే అరిచాడు. ఆశ్చర్యంగా గుడ్లగూబ మళ్లీ అలాగే అరిచింది.

మరుసటి రోజు రాత్రి కూడా అలాగే జరిగింది. చరణ్, అతడి ప్రియమైన పక్షి అలాగే పరస్పరం కూత పెట్టారు. గూబతో చరణ్ మాట్లాడుతూ పోయాడు కూడా. పైగా పక్షుల భాషలో తాను ఎంతో ప్రావీణ్యత సాధించినట్లు కూడా అతడు భావించాడు.

ఆ సమయంలోనే చరణ్ భార్య అమల పొరుగింటి మహిళ రాధతో మాట్లాడుతోంది.

'మా ఆయన రాత్రంతా గుడ్లగూబలతో మాట్లాడుతూ గడిపాడు తెలుసా', అన్నది అమల. 'ఓస్, మా ఆయన కూడా ఆ పనే చేశాడు మరి', అన్నది రాధ.



ఉపాధ్యాయురాలు: 'నువ్వు ధరించిన సాక్సులు చిత్రంగా ఉన్నాయిరా, ఒకటి ఆకుపచ్చది మరొకటి ఎర్ర మచ్చలున్న నీలిరకం!!'

పప్పు: 'అవును, ఇది నిజంగానే చిత్రంగానే ఉంది టీచర్ నాకు ఇంట్లో ఇలాంటి మరొక జత చెప్పులు కూడా ఉన్నాయి మరి!'

ఒక చిన్నారి బాలిక తిమింగలాల గురించి తన టీచర్‌తో మాట్లాడుతోంది. టీచర్ ఆ చిన్నారితో మాట్లాడుతూ, 'తిమింగలం చాలా పెద్ద జీవే అయినప్పటికీ దాని నోరు చాలా చిన్నది కాబట్టి అది మనిషిని మింగటం అసాధ్యమ'ని చెప్పింది.



అయితే తిమింగలం తనమిత్రుడు జానయ్యను మింగేసిందని రాధ చెప్పింది. కాని తిమింగలం మనిషిని మింగలేదని, అది అసాధ్యమని ఉపాధ్యాయురాలు మళ్లీ నొక్కి చెప్పింది. 'సరేనండీ నేను స్వర్గానికి పోయినప్పుడు ఈ విషయాన్ని జానయ్యనే అడుగుతాను'.

ఉపాధ్యాయురాలు, 'జానయ్య నరకానికి పోయి ఉంటే?' అని రెట్టించింది. 'అప్పుడు మీరే అతడిని అడగండి' అన్నది రాధ.

# ఊరగాయతో ఏముంది?





ఊరగాయలకు మూలం ఈజిప్ట్ దేశమని అందరూ భావిస్తున్నారు. ప్రాచీన ఈజిప్ట్ వాసులు పుచ్చకాయలు, చేపల ఊరగాయలు చేసేవారు. ప్రస్తుతం ప్రపంచమంతా ప్రాచుర్యంలో ఉన్న దోసకాయల ఊరగాయలను 3 వేల సంవత్సరాల క్రితమే భారతదేశంలో తయారు చేసేవారు. పైగా కన్నడ సాహిత్యంలో తొలి రచన అయిన లింగపురాణం మామిడి, వంకాయ, రొయ్య, పంది మాంసంతో సహా 50 రకాల ఊరగాయలను గురించి పేర్కొంది.



క్రిస్టమస్ చెట్టుపై ఊరగాయ రూపంలోని నగలను వేలాడదీయడం చాలా పాత సంప్రదాయంగా భావించబడుతోంది. ఈనాటికీ ఈ ఆచారాన్ని అనేక ఇళ్లలో పాటిస్తూనే ఉన్నారు. కొన్ని సార్లు ఇది చెట్టులోపల దాగి ఉంటుంది. లోపల దాగిన ఈ నగను కనిపెట్టిన పిల్లవాడికి సెయింట్ నికోలస్ నుండి ప్రత్యేక బహుమతితో పాటు ఆశీర్వాదం కూడా లభించేది.



కొలంబస్ తన అన్వేషణా యాత్రలు చేస్తున్న కాలంలో, అతడి సిబ్బంది స్కర్వీ అనే విటమిన్ సి లోపంతో కూడిన వ్యాధితో బాధపడేవారు. అమరిగో విష్పూచి అనే యాత్రికుడు విటమిన్ సి సమృద్ధిగా కలిగిన ఊరగాయలను పెద్ద మొత్తంలో తన నౌకలో పెట్టేవాడు. స్కర్వీ వ్యాధిని ఊరగాయలు నిరోధించగలిగేవి. దీంతో ఈ ఊరగాయల వ్యాపారి తదనంతరం పెద్ద అన్వేషకుడుగా పేరొందాడు. అమెరికాను కనుగొనడంలో ఊరగాయలు వహించిన పాత్ర ఎంత ముఖ్యమైనదో చూడండి మరి!



ఊరగాయల్లో ఎలాంటి పోషక పదార్థం లేదని అన్నదెవరు? కొరియన్ శాస్త్రజ్ఞుల అభిప్రాయం ప్రకారం ప్రత్యేక రకం క్యాబేజ్ ఊరగాయ మామూలు క్యాబేజ్ కంటే రెట్టింపు స్థాయిలో విటమిన్ బి1, బి2, బి5 మరియు బి12 లను కలిగి ఉంటాయట.



ఊరగాయలు అంటే ప్రాణమిచ్చే ఒక ప్రముఖ అభిమాని గురించి మాట్లాడుకుందాము. అమెరికా అధ్యక్షుడు జార్జ్ వాషింగ్టన్ దాదాపు 476 రకాల ఊరగాయలను సేకరించాడట.





జగదేకసుందరి క్లియోపాత్ర అద్వితీయ సౌందర్యానికి ఊరగాయలే కారణమని పరిశోధకులు చెబుతున్నారు. ప్రత్యేకించి పుచ్చకాయలతో చేసిన ఊరగాయ అంటే ఆమె ఎంతో మక్కువ చూపేదట. అలాగే దోసకాయ ఊరగాయ కూడా ఆమె ప్రాధాన్యతలలో ఒకటిగా ఉండేదట.



కూల్-ఎయిడ్ పికిల్స్ గురించి విన్నారా? ఇది పాత పద్ధతి నుంచి మెరుగులు దిద్దిన ఊరగాయ. ఉప్పునీటిలో కూరగాయలు లేదా పండ్లను ఊరబెట్టడానికి బదులుగా కూల్-ఎయిడ్ మిక్స్‌లో వాటిని నిల్వ ఉంచేవారు. ఈ కొత్త పద్ధతిలో చేసిన ఊరగాయలను ప్రజలు లొట్టలేసుకుని ఆరగించేవారట.



నెపోలియన్ ఊరగాయలను తన సైన్యాల ఆరోగ్యాన్ని సంరక్షించేవిగా లెక్కించేవాడట. ఊరగాయలను భద్రంగా నిల్వఉంచి, ఊరబెట్టే పద్ధతితో తన వద్దకు వచ్చేవారికి అధికమొత్తంలో డబ్బులను బహుమతిగా ప్రకటించడానికి కూడా అతడు సిద్ధపడ్డాడట. సైనిక కార్యక్రమాల సందర్భంగా తమ సైన్యాలకు నెపోలియన్, జూలియస్ సీజర్ ఇరువురూ దోసకాయ ఊరగాయలను తప్పనిసరిగా అందించేవారని తెలుస్తోంది.



మరికొందరు అభిమానులు!

- పదమూడవ శతాబ్దంలో, కింగ్ జాన్ ఇచ్చే ప్రముఖ విందులో ఊరగాయలు ప్రధాన వంటకంగా వడ్డించేవారట.
- రోమన్ చక్రవర్తి టిబెరియస్ ప్రతిరోజూ ఊరగాయలను ఆరగించేవాడని ప్రతీతి.
- ఊరగాయలలో ఉండే నొప్పి తగ్గించే గుణాన్ని అరిస్టాటిల్ ప్రశంసించాడు కూడా.
- ఒకటవ ఎలిజబెత్ రాణి కూడా ఊరగాయలంటే పడి చచ్చేదని తెలుస్తోంది.



పసిఫిక్ దీవుల్లో స్థానికులు పండ్లు, కూరగాయలను ఉపయోగించి చేసే ఊరగాయలను అరటి ఆకులతో కప్పిన గుంటలలో ఉంచేవారు. ఫిజీ దీవులలో, అమ్మాయి తల్లిదండ్రులకు తన వద్ద ఉన్న ఊరగాయల గుంటలను చూపించిన తర్వాతే ఆ అమ్మాయిని పెళ్లాడేవాడు!



# మన దేశభాషలు నేర్చుకుందాం

ఈ జాబితాలో మొదట మీకు తెలిసిన భాషలలోని పదాలను చదవండి. ఆ తరవాత వాటి కింద ఇచ్చిన పదాలను అనుసరించి ఆయా భాషలలో ఆ పదాల ఉచ్చారణలనూ, అర్థాలనూ నేర్చుకోడానికి ప్రయత్నించండి.





| English | The exam is over. | How was it? |
|---|---|---|
| Telugu | పరీక్ష ముగిసింది. | అది ఎలా ఉంది? |
| Hindi | परीक्षा ख़त्म हो गई है।<br>పరీక్ష ఖతమ్ హో గయీ హై. | कैसी रही?<br>కైసీ రహీ? |
| Tamil | தேர்வு முடிந்து விட்டது.<br>తేర్వు ముడిన్దు విట్టదు. | எப்படி இருந்தது?<br>ఎప్పడి ఇరున్దదు? |
| Bengali | পরীক্ষাটা শেষ।<br>పొరిక్షాటా షెష్. | কেমন হল?<br>కెమొన్ హోలో? |
| Marathi | परीक्षा संपली आहे.<br>పరీక్ష సాంప్లీ ఆహె. | कशी गेली?<br>కశీ గెలీ? |
| Kannada | ಪರೀಕ್ಷೆ ಮುಗಿಯಿತು.<br>పరీక్షె ముగియితు. | ಅದು ಹೇಗಿತ್ತು?<br>అదు హేగిత్తు? |
| Odia | ପରୀକ୍ଷା ସରିଯାଇଛି।<br>పరిక్ష సరిజాయిచ్ఛి. | ଏହା କିପରି ଥିଲା?<br>ఏహా కిపరిథిలా? |
| Gujarati | પરીક્ષા પૂર્ણ થઈ.<br>పరీక్షా పూర్ణ థయీ? | તે કેવું હતું?<br>తె కెవు హ తు. |
| Assamese | পৰীক্ষা শেষ হ'ল।<br>పొరిఖ్యా శేష్ హోల్. | এইটো কেনে আছিল?<br>ఎఇటో కెনె ఆసిల్? |
| Malayalam | പരീക്ഷ കഴിഞ്ഞു.<br>పరీక్ష కళింజు? | അതെങ്ങനെയുണ്ടായിരുന്നു?<br>అతెంగనె ఉన్డయిరున్ను? |
| Santali | ᱵᱤᱱᱤᱫ ᱫᱚ ᱥᱮᱫ ᱮᱱᱟ।<br>బినింద్ దొ సెత్ ఎన. | ᱪᱮᱫ ᱞᱮᱠᱟ ᱦᱟᱞᱟᱭ ᱮᱱᱟ?<br>చెద్ లెక హలయ్ ఎన్? |
| Sanskrit | परीक्षा समाप्ता।<br>పరీక్షా సమాప్తా. | कथमासीत् परीक्षा?<br>కథమాసీత్ పరీక్షా? |







| English | Not very good. | I will study well. |
|---|---|---|
| Telugu | ఫరవాలేదు. | నేను బాగా చదువుతాను. |
| Hindi | बहुत अच्छी नहीं।<br>బహుత్ అచ్ఛీ నహీ. | मैं ठीक से पढ़ूँगा।<br>మై ఠీక్ సె పఢూంగ. |
| Tamil | சரியாக இல்லை.<br>సరియాగ ఇల్లై. | நான் நன்றாகப் படிப்பேன்.<br>నాన్ నన్‌రాగ పడిప్పేన్. |
| Bengali | খুব ভাল নয়।<br>ఖుబ్ భాలో నొయ్. | আমি ভালো করে পড়ব।<br>ఆమి భాలో కొరె పొర్బొ. |
| Marathi | फार चांगली नाही.<br>ఫర్ చంగ్లీ నహీ. | मी चांगला अभ्यास करीन.<br>మి చంగ్ల అభ్యాస్ కరిన్. |
| Kannada | ತುಂಬಾ ಚೆನ್ನಾಗಿರಲಿಲ್ಲ<br>తుంబా చెన్నాగిరలిల్ల. | ನಾನು ಚೆನ್ನಾಗಿ ಓದುತ್ತೇನೆ.<br>నాను చెన్నాగి ఓదుత్తేనె |
| Odia | ଖୁବ୍ ଭଲ ହୋଇନାହିଁ।<br>ఖుబ్ భల హోయినాహిఁ. | ମୁଁ ଭଲ ଭାବରେ ପଢିବି।<br>ముఁ భల భాబరె పఢిబి. |
| Gujarati | ખૂબ સારું નહીં.<br>ఖూబ సారు నహీ. | હું સારો અભ્યાસ કરીશ.<br>హు సారో అభ్యాస కరీష్ |
| Assamese | বৰ ভাল নাছিল।<br>బొర్ భాల్ నాసిల్. | মই ভালদৰে অধ্যয়ন কৰিম।<br>మొయి భాల్‌దొరె అధ్యయన్ కొరిమ్. |
| Malayalam | അത്ര നല്ലതല്ലായിരുന്നു.<br>అత్ర నల్లథల్లయిరున్ను. | ഞാൻ നന്നായി പഠിക്കും.<br>ఞాన్ నన్నాయి పఠిక్కుమ్. |
| Santali | ᱩᱱᱟᱝ ᱫᱚ ᱵᱮᱥ ᱵᱟᱝ ᱮᱱᱟ।<br>ఉనంగ్ దొ బే బేస్ ఎన. | ᱤᱧ ᱵᱮᱥ ᱯᱟᱲᱦᱟᱣ-ᱟ।<br>నమయ్ ఇంజ పఢాగ్-అ |
| Sanskrit | न बहु सम्यक्।<br>న బహు సమ్యక్. | अहम सम्यक् पठिष्यामि।<br>అహమ్ సమ్యక్ పఠిష్యామి. |



శివకల్యాణ్ పుట్టినప్పుడు, అతడి వెన్నుముక పట్టు తప్పి జీవితాంతం బాధపడవలసి వచ్చింది. కాని ఇది తొమ్మిదేళ్ల ఈ బాలుడిని బాలమేధావి కాకుండా అడ్డు కోలేకపోయింది. పుట్టిన మూడున్నర సంవత్సరాల తర్వాత కూడా ఇతడికి పాకటం రాలేదు. తమ బిడ్డకు మంచి వైద్యం అందించే కోరికతో శివ తల్లిదండ్రులు అతడితో పాటు అమెరికాకు వెళ్లారు. శివ అమెరికాకు వెళ్లిన తర్వాత అతడి వయసు రీత్యా తనను రెండో తరగతిలో చేర్పించారు. కాని ఉపాధ్యాయులు త్వర లోనే అతడు సామాన్యుడు కాదని గుర్తించారు. అత డిని ఎనిమిదవ తరగతి పరీక్షలకు కూర్చోబెట్టారు. కాని అతడు కాలేజీ కోర్సు చదవడానికి తగిన అర్హత కలిగి ఉన్నాడని త్వరలోనే కనిపెట్టారు. శివ మేధస్సు అచిరకాలంలోనే గుర్తింపు పొందింది. అమెరికాలోకెల్లా ప్రతిష్టాత్మకమైన జాన్స్ హాప్కిన్స్ విశ్వవిద్యాలయంకి చెందిన సెంటర్ ఆఫ్ టాలెంటెడ్ యూత్ నుండి అతడు రెండు అవార్డులు అందుకున్నాడు కూడా. అలాగే ఎస్ఎటి 1, ఎస్ఎటి 2 పరీక్షల్లో కూడా ఇతడు మంచి మార్కులు సాధించాడు. అమెరికాలో వైద్యం చేయించుకుంటున్నపుడు శివ శారీరక పరిస్థితి కూడా మెరుగయింది. వాకర్ సహాయంతో అతడీరోజు నడవగలడు కూడా.



ఫ్రాన్సిస్ తమిళనాడు గ్రామీణ ప్రాంతాల్లోని రోగులకు సహాయం చేయడానికి 1974లో భారతదేశంలో అడుగుపెట్టింది. నర్సుగా శిక్షణ పొందిన ఫ్రాకోయిస్ సామాజిక, ఆరోగ్య విద్యా కార్యక్రమాలలో, క్షయ వ్యాధి నిర్మూలనా కార్యక్రమాలలో పాలు పంచుకుంది. బొమ్మల తయారీలో కూడా ఆమె ఇక్కడే తీవ్రంగా కృషి చేసింది. ఫ్రాంకోయిస్ బొమ్మలు మాట్లాడతాయి. జీవన సౌందర్యం గురించి, జీవితానందం గురించి అవి మాట్లాడతాయి. నిరు పేదలకు జరుగుతున్న అన్యాయం గురించి, వారి ఆగ్రహం నిస్పృహల గురించి కూడా అవి మాట్లాడతాయి. అద్భుతంగా రూపొందించబడే ఈ బొమ్మలు వాస్తవ భంగిమలలో కొట్టొచ్చినట్లు కనపడతాయి. వాటి సృష్టికర్త కలలు, ఆశలు, అన్వేషణలు, స్నేహాలు, కన్నీళ్లు, నిరసనలు మరియు ఆమె ఆగ్రహాన్ని కూడా ఇవి వ్యక్తీకరిస్తుంటాయి.

# విదూషకుడు బీర్బల్



## పండితుడు



1. ఒకరోజు సేవారామ్ అనే పొరుగు వ్యక్తి బీర్బల్ వద్దకు వచ్చాడు. 'మిత్రమా, నాకు మీ విలువైన సలహా కావాలి,' అని అన్నాడు. బీర్బల్ 'ఏందులో సహాయం కావాలి' అనడిగాడు.



2. 'మా తాత ముత్తాతలు గొప్ప సంస్కృతపండితులు. ప్రజలు వారిని గౌరవంతో పండితవర్యా అని పిలిచే వారు. నాకు కూడా జనం చేత పండితుడని అనిపించుకోవాలని ఉంది'.



3.బీర్బల్ ఒక్క క్షణం ఆలోచించాడు. 'నా సలహా పాటించు! నిన్ను ప్రజలు పండితవర్యా అని పిలిచినప్పుడు వాళ్లపై గట్టిగా కేకలేయి. వారు నిన్ను పండితవర్యా అని పిలిచేటట్లు చేస్తాను,' అన్నాడు.



4. బీర్బల్ కొంత మంది పొరుగింటి పిల్లలను పిలిచి సేవారామ్‌ను పండితవర్యా అని పిలువవలసిందిగా కోరాడు.



5. వాళ్లు అతడితో మాట్లాడుతూ, 'పండితవర్యా! నీ నడక బాతునడకలా ఉంది. హా.. హా..' అంటూ నవ్వారు. సేవారామ్ వెంటనే రెచ్చిపోయి, 'మూర్ఖుల్లారా నోరు మూయండి' అని అరిచాడు.





6. మరొక రోజు.. 'పండితవర్యా! మీ తలకుచ్చు పాములాగా ఉంది! హాహ్హాహ్హా! హిహ్హిహ్హి! హరాహ్హరాహ్హా!' అని ఎగతాళి చేశారు పిల్లలు. సేవారామ్, 'వెధవల్లారా మిమ్మల్ని చంపేస్తాను,' అన్నాడు.



7. సేవారామ్ మండిపడటం చూసిన పిల్లలు మరి
తగా ఆనందించారు. పదే పదే అతడిని పండితుడ
పిలవడం ద్వారా వాళ్లు అతడిని ఆట పట్టిస్తూ వచ్చార



8. పెద్దవాళ్లు కూడా పిల్లల
వర్యా ఎక్కడికి వెళుతున్నా
'నరకానికిరా వెధవల్లారా!
నలిపివేస్తాను!' అని ఉగ్రు



లను తిట్టి తిట్టి అలసిపోయా
రు నిల్చి పోయింది. తర్వాత అ
. 'కృతజ్ఞతలు మిత్రమా! ఇప్ప
డితవర్యా అంటున్నారు!'

విదూషకుడు
బీర్బల్



పండితుడు

ప్రయరీ కుక్కలు వా
ా ఉంది కదూ? అయిన
ఇది నిజం!

అమెరికాలోని విశా
ంచే జంతువులను ప్రయ
డాగ్స్ అనీ అంటారు.
లు నిజానికి ఉడత జాతి
చెందినవి. ఇవి కుక్కల్లాగా మొరగటం వల్ల వీటికి కుక్కలని పేరు వచ్చింది.

ఇవి గుంపులు గుంపులుగా నివసిస్తాయి. పగటిపూటంతా తింటూనో, తోటి జంతువులతో
కలిసి గెంతుతోనో కనిపిస్తాయి. రాత్రి పూట సురక్షితమైన బొరియల్లో హాయిగా నిద్రపోతాయి

ప్రయరీ కుక్కలు ఒకదాన్ని ఒకటి చూడగానే సంతోషంతో పళ్లికిలిస్తూ పలకరి
చుకుంటాయి. ఆ తరవాత ఆనందంతో తోకలను ఆడిస్తాయి.

